# అంకితము

స్వామీ శివశంకరులు నాకేకాదు అధునాతనాంధ్ర యువ ప్రపంచానికంతకూ మాన్యులు. మాలిన్యమెసోకని రాజకీయ చైతన్యానికి అనంతమైన సాహిత్యావేశానికీ సర్వసమతపై మమతకల్గిన అద్వైతార్థదర్శనానికీ స్వామి శివశంకరుల వారు ఆదర్శమూర్తులు. తాదృశులైన మహేంద్రుని విశాల నేత్రాలనుండి జాలువారే ప్రేమవాహినిలో నా హృదయాన్ని తడుపుకుంటూ వారి పాదపీఠదగ్గర నా యీ కృతి కుసుమాన్ని నమ్రుడనై సమర్పిస్తున్నాను.

ఇ తి శి వ మ్.

నీలంరాజు శ్రీనివాసరావు

# వక్తవ్యము

“గాజుకొంపలు” అనే రూపక నామాన్నిబట్టి హేళనగా (Satire) పాఠకులు గ్రహించవచ్చును. గాజుకొంపలనుబోలు మనుష్యులను మనం నేటిసమాజంలో లెక్కకు మిక్కుటంగా చూడగలం. నాటకకర్త వాస్తవప్రపంచంలో రాజకీయప్రాణుల్ని బోలు మనుష్యులనుగా హేళనచేసినాడు. చేతులెత్తే మూర్ఖులు పదిమంది వెనకాల ఉన్నప్పుడు నాయకుడుకావడం సామాన్య విషయం. దేశసేవాపరాయణత్వమనే ముసుగులో రాక్షసమైన స్వార్థాన్ని లోలోపల దాచుకొని హేమాహేమీలై అమాయకుల్ని పీల్చి పిప్పిచేయ సాహసిస్తున్నారు. సత్యానికి మసిపూస్తారు. సమయాన్ని స్వార్థానికి ఉపయోగించుకోడం, పైగా సత్యాహింసలు పలకడం చూస్తూనే ఉన్నాము. రాజకీయంగా నైతికంగా ఆధునిక సంఘం పతనోన్ముఖమైనప్పుడు పరిస్థితులను అవహేళన చేయకతప్పదు. ప్రత్యేకంగా వ్యక్తిదూషణకు తావియ్యకు. చమత్కార ధోరణిలో నవీన జీవితాన్ని హేళనచేయడం సముచితం. నీలకంఠేశ్వరప్రసాదు వంటివాళ్ళు మనకు చాలామంది కనబడతారు. ప్రకృతిలో సంభవించిన వైపరీత్యాన్ని పురస్కరించుకొని నిజమైన నిస్వార్థమైన సేవచేయడానికిబదులు సరోజినివంటి అమాయికులను దీనులను దోపిడిచేయబోతారు దేశసేవాపరాయణులు. పాత్రపోషణ బాగా నాటకకర్త చేయగలిగినాడు. కథాగమనం వేగంగా ఉంది. నిర్వహణం నేర్పుగా వుంది. నాటకం రంగానుకూలం. అది రక్తికట్టడం నేను స్వయంగా చూచాను.

హేళన ఆంగ్లసారస్వతంలో అధికంగా వుంది. 17 వ శతాబ్దిలో విగ్గులకూ టోరీలకు సంఘర్షణ ప్రచండమైనప్పుడు హేళనచేసుకొంటూ ఇరుపక్షాలవారు కాగితాలయుద్ధం సాగించారు. అయితే సారస్వతంలో డ్రైడన్ కవీశ్వరుడుమాత్రం వ్యక్తి దూషణకు అంగీకరించక పౌరాణికమైన గాథలద్వారా తత్కాలిక మనస్తత్వాలను విమర్శించినాడు. హేళనలో ప్రధానోద్దేశ్యం ఏమిటి? దోషగర్హణ గుణస్తవము ప్రధానము. దోషాన్ని హేళనచేసినా అతి నిశితంగాఉంటే సరసమనిపించుకోదు. పోప్ నాజూకుగాకాక వ్యక్తిగతంగా తీవ్రంగా పరులహృదయాలను గాయంచేసేవాడు. గాజుకొంపలనే నాటకం చమత్కారధోరణిలోనే సాగింది. శ్రీ నీలంరాజు శ్రీనివాసరావుగారు నాట్యానుభవం గలవారు Himakar Arts Club అనే సంస్థకు కారకులు, చాలానాటకాలురచించి సంస్థకు వన్నె తీసికొనివస్తారనేవిశ్వాసం నాకున్నది. ఈనాటకం జనామోదం పొందుతుందనే నాతాత్పర్యం.

ఒంగోలు
8-12-53

కృత్తివాసతీర్థులు M. A.

# కృత్యాది

ఏదన్నా ఒక రచన చేయాలన్నా, కళారంగంలో ఒక ప్రయత్నం చేయాలన్నా మానవుడికి కావలసింది ప్రోత్సాహము. ఏదో ఒకటి చెయ్యాలనే ప్రయత్నంలేనిదే, ఆశ అనేగాలి సాయపడనిదే, పడవ నడవడం కష్టము. అందుకని చుక్కానిపట్టి, నడకను తీర్చిదిద్దేది నావికుడికి చుట్టూవున్న వాతావరణం. ఇది దిట్టంగావుండి వీపుతట్టితే మానవుడెంతేనా చేయగలడు. కాదంటే కొంతైనా చేయగలడు.

కేవలం నాకలాగే జరిగింది. నలుగురు మిత్రులూ, అందులో యింత సంస్కారమున్నవాళ్ళు, ఒకచోట కూడుకుంటే యేదో పొద్దుపోవడానికీ, మంచిచెడ్డలు మాట్లాడుకోడానికీ, యెవరి సరదాలు వారు తీర్చుకోడానికీ, ఒక సౌహార్ద మేర్పడిందన్నమాటే. సరిగా యిలాగే జరిగింది మాలో. మా క్లబ్‌లో మొదట సంకురమయ్య నాటకాలమీదికి వెళ్ళాడు. నాటకమనేసరికీ అందరికీ సరదాయే, అయితే, నాటకమేదీ? అదే కొరమైతేవున్నాం, ఒకరికి నలుగురం. పాతనాటకాలు యెన్నిచేసుకున్నా కొత్తవికావు. కొత్త కొత్తల్లో కొత్తేకాకుండా వింత, తనక నాటకం వ్రాయడం మంచిదనుకున్నాం. ఎవరువ్రాసేట్టు? అందరు రచయితలే, పేరంటంలో ముత్తైదువుల పాటలవలె నువ్వంటే నువ్వన్నారు. అంతాకలిసి నన్ను ముందుకు తోసారు. సరే వ్రాశాను. ఇందులో అపశ్రుతులకు, సుశ్రుతులకు, మంచికీ, చెడ్డకూ, నటవరులే ప్రమాణం.

ఈ నాటకాన్ని రచించి ఒక్క సంవత్సరం ఇందులో గోదావరి వరద అనే సంఘటన జరిగినట్లుగా చిత్రించాను, కథావస్తువు అందరికీ అందుబాటులో వుండటానికే అలాంటి రచనచేశాను. ఇందులో వ్యక్తులను గాని, సంస్థలను గాని, నే నుద్దేశించాననుకోడం భుజాలు తడుముకోడమే.

నాటక రచనకు నన్ను ప్రోత్సహించిన మిత్రులు తల్లావఝుల కృత్తివాసతీర్థులుగారికి, ప్రచురణకర్తైన కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ వారికి నా కృతజ్ఞతలు. గ్రంథాన్ని స్వీకరించి నన్నాశీర్వదించిన స్వామి శివశంకరులవారికి నా నమస్సులు.

ముకుళిత హస్తాలతో యీ నా రచనను తెలుగు చదువరుల కందజేస్తున్నాను.

ఒంగోలు
9-12-1953

సెలవు.
నీలంరాజు శ్రీనివాసరావు.

## ★ పాత్రలు ★

* నీలకంఠ ప్రసాద్
* గౌరీపతి
* హిమకరబాబు
* ప్రచండశాస్త్రి
* తమ్మన్న
* మురుగన్
* బెస్త వెంకన్న
* సరోజిని
* శ్యామల
* ఇద్దరు ముగ్గురు వాలింటర్లు *

# గాజు కొంపలు

## ఒకటవ రంగం

[నీలకంఠప్రసాద్ గారి గది. ఆయన హడావుడిగా షోకు చేసుకుంటూ అద్దానికి యెదురుగా నిలబడి వుంటాడు.]

నీల : తమ్మన్నా ! ఆ పౌడరుడబ్బా యిలా ఇయ్యి.

తమ్మ : చిత్తం ! (పౌడరుడబ్బా అందిస్తాడు )

నీల : (ముఖానికి పౌడరు అద్దుకొని, అద్దం చూచుకొని తమ్మన్న వైపు తిరిగి) ఇప్పుడు చూడు తమ్మన్నా ! ఆ ముడుతలు కనిపించటము లేదనుకుంటాను. యేం ?

తమ్మ : (పరీక్షగా చూచి) లేదండీ.

నీల : (మరల అద్దంవైపు తిరిగి క్రాపు దువ్వుకొంటూ) పైమెంతైంది తమ్మన్నా !

తమ్మ : (చూచివచ్చి) చిన్నముల్లు పెద్దముల్లు కూడా ఆరుమీదికి వచ్చాయ్ బాబుగారూ !

నీల : అరే ! Six thirty అయిందా ! అయితే పైమైందన్న మాట. ఇదిగో చూడు తమ్మన్నా ! ఆచేతికర్రా, గాంధీ టోపీ, ఖద్దరు వుత్తరీయం యిలా తీసుకొని రా. ఆఁ చూడు, సెక్రటరీ గౌరీపతిగారినిగూడా ఒకసారి యిలా రమ్మను.

తమ్మ : (హడావుడిగా వెళ్తాడు.)

నీల : దొరికిన అవకాశాన్ని వుపయోగించుకోవడమే తెలివితేట లన్నాడు జార్జి బెర్నార్డ్ షా !

[గౌరీపతి ఫైల్సుతో హడావుడిగా ప్రవేశిస్తాడు.]

నీల : ఏమండి గౌరీపతిగారూ ! ఆ ప్రెస్ రిపోర్టు తయారు చేశారా !

గౌరీ : చిత్తం.

నీల : యేదీ ఒకసారి చదవండి.

గౌరీ : గోదావరి వరదబాధితుల సహాయార్థము శ్రీ నీలకంఠ ప్రసాద్ గారు శ్రమకు వెనుదీయక సేవ చేయుచున్నారు. వారు వరదబాధితుల నిధిని కూడా వసూలుచేయ మొదలు పెట్టారు. కనుక, సహృదయులు, ఉదారస్వభావులు వీరు చేయు సేవకు తోడ్పడి..........

నీల : నాన్‌సెన్స్ ! నేనొకటి చెపితే మీరొకటి రాస్తారేమిటి ?

గౌరీ : పూర్తిగా వినండి. నిధికి చందాలియ్యమనే రాశాను.

నీల : "కాళిదాసుగారి కవిత్వం కొంత, నాపైత్యం కొంత" అన్నట్లుంది మీరాత.

గౌరీ : చిత్తం ! మనకు డబ్బు ప్రధానం కనుక ఆ విషయమే యెక్కువగా ప్రస్తావించాను.

నీల : యీరాత యిలా యేడిస్తే, మనరాత యెలా యేడవాలి చెప్పండి. నేచెప్తాను రాసుకోండి.

గౌరీ : చిత్తం.

నీల : శ్రీ వేదాంత శిరోమణి నీలకంఠప్రసాద్ గారు M. A. P. H. D.
L. L. B. మ్యునిసిపల్ చైర్మన్, M. P. గారు, గోదావరీ
వరదలవల్ల ఘోరవిపత్తుల పాలయిన, ఆంధ్ర సోదర
సోదరీమణులను చూచి కన్నీరు మున్నీరుగా, అ(........
ఆ( హా(. కాదు. కన్నీరు వరదలై పారేలాగున విల
పిస్తున్నారు. (అద్దంలో చూచుకొని క్రాపు సరిదిద్దు
కుంటూ) రాశారా!

గౌరీ : చిత్తం.

నీల : వారు వారి యావదాస్తిని అర్హులైన సోదర సోదరీమణు
లకు వినియోగిస్తున్నారు. వారి పడవలన్నిటిని, అప్పుడే
వరదలలో కొట్టుకుపొయ్యేవాళ్ళను ఒడ్డుకుచేర్చేందుకు
వినియోగపరుస్తున్నారు. (అద్దంచూచుకుని కండువా సరి
దిద్దుకుంటూ) వీరు వరద బాధితులనిధిని కూడా వసూలు
చేయ మొదలుపెట్టారు. శక్తి వంచనలేక, శ్రమఅనుకోక,
వీరు చేయదగినదంతా చేస్తున్నారు. మొన్న మంత్రులతో
పాటు వీరుకూడా వరద పాలైన ప్రదేశాలన్నిటినీ విమా
నంలో పర్యటించివచ్చారు. యావదాంధ్రదేశ ప్రజలకు
యీ వరద ప్రాంతప్రజలు విన్నవించుకునేదేమనగా,
సహృదయంతో, వీరితో సహకరించి తమ చేతనైన
సహాయము ధనరూపకంగాగాని, యితర వస్తురూపకంగా
గానీ, చేయమని ప్రార్థిస్తున్నాము. ఇట్లు, విన్నవించు
విధేయులు, వరద బాధితులకమిటీ.

గౌరీ : యీ వరద బాధితులకమిటీ యెక్కడుందండీ ?

నీల : ఉన్నదో లేదో యెవరికి కావాలండీ ? ఆ మాటకొస్తే దేవు డెక్కడున్నాడో మీరు చెప్పగలరా ? మీరు చదువు దురూ మీకెందుకు ?

గౌరీ ; చిత్తం. (చదువుతాడు.)

నీల : అపీలంటే యిలావుండాలి. యీ ప్రెస్ స్టేట్‌మెంట్ చదివితే మనంచేస్తూన్న కృషియేమిటో దేశం అర్థం చేసుకుంటూంది. ఈసారి ఎలక్షన్స్‌లో మనం un Contested గా ప్రధానమంత్రికావచ్చు. ఆ. చూడండీ ? మన ప్రెస్ రిపోర్ట్ అసత్యప్రచారిణి అనే పత్రికకే పంపించండి. ఎందుచేతనంటే ఆ పత్రిక అయితే యిలాంటి వాటిని సాధారణంగా మొదటిపేజీలోవేస్తుంది. ఊ. ఊ; త్వరగా పంపించండి. (గౌరీపతి వెళ్తూంటే) చూడండి ఆ వలంటీరు కుర్రాళ్ళకు బాపిరాజుగారి "ఉప్పొంగి పోయింది గోదావరి" అనేగేయం చెప్పించారా ? యేదీ, వాళ్ళనోసారి యిలా పిలుచుకురండి. చూద్దామ్.

గౌరీ ; చిత్తం.

[గౌరీపతివెళ్తాడు. బెస్తవెంకన్న ప్రవేశిస్తాడు.]

నీల : ఏమోయ్ వెంకన్నా ? యేమాత్రం వసూలు ?

వెం : యెంతేతది బాబయ్యా ? ఇల్లు, వాకిళ్ళన్నీ కొట్టుకుపోయి, కుతికిలదాకా మునిగిపోయి పడవ కనడిపతే, పరమశివుడు

కనపడ్డట్టు సేతులెత్తి దండాలు పెడుతూ పానాలైనా దక్కించుకొందామని కొట్టకలాడేవాళ్ళదగ్గర యేమ్ వసూలౌతుంది బాబయ్యా! నిజంగా ఆళ్ళను చూస్తూంటే నా కేడుపొచ్చేసింది బాబయ్యా! నోటా, ముక్కునా నీళ్ళుపోసుకోని, తలలాడిస్తూ, పోయీపోని పానాలతో కొట్టకలాడేవాళ్ళను నాలుగిస్తావా? అయిదిస్తావా అని అడక లేకపోయినాను బాబూ! చెప్పద్దూ, చేసినపాపం, కాకపోతే, ఆళ్ళనులాగి, పడవమీదేసి, జేబులు, మెడలూ తవిడి. వసూలైనమటుకు తీసుకొచ్చా. ఇదిగో. (డబ్బు బల్లమీద వుంచును.)

నీల : (కోపంతో) యేడ్చినట్లేవుంది నీపరోపకారబుద్ధి. ఆపద సమయంలో కాకపోతే మరోసమయంలో కానీయిస్తారా! వెఱ్ఱి పీనుగ.

వెం : గోదావరితల్లికి కోపంవస్తది. మనం నీలకంఠ ప్రసాదు గారి పడవల్లో బయటపడాలని ఆళ్ళేమైనా ముందుగా కలగన్నారాఅండి! డబ్బు మూటగట్టుకోని కూర్చో డానికి.

నీల : అఘోరించినట్లేవుంది కాని డబ్బు బాగా యివ్వగలిగిన వాళ్ళనే ఒడ్డుకుచేర్చు. ఇదిగో వెంకన్నా! డబ్బు లేని వాళ్ళు బతికినా చచ్చిన వాళ్ళలోనే లెక్క. సమయం దాటిపోయిందంటే కానీ సంపాదించలేము. పడవలన్నీ

బాగా తిప్పు. యీ వరద లాగిపోయేలోగా కనీసం ఒక లక్షయాపాయలైనా యీడ్చిపారెయ్యాలి.

వెం : సిత్తం. (వెళ్తాడు.)

[గౌరీపతి, వాలింటరీలు ప్రవేశిస్తారు.]

నీల : ఆఁ. వచ్చారా గౌరీపతిగారూ! వీరేనా వాలంటరీలు. వీరు దుర్గమ్మగారి జాతీయ సంస్థకు చెందిన వారనుకుంటాను. యేదీ "ఉప్పొంగి పోయింది గోదావరీ" అనే గేయా న్నొకసారి పాడండి విందామ్. (వాలింటరీలు పాడుతూ వుంటారు. నీలకంఠ ప్రసాదు సరిదిద్దుతాడు) తమ్మన్నా! ఆ వరద బాధితుల నిధిడబ్బాలనూ, గాంధీ టోపీలను, జాతీయపతాకాలను వీళ్ళకు తలాఒకటియ్యి. ఇల్లుజాగ్రత్త నేను వెళ్ళొస్తాను.

[అందరూ పాడుతూ వెళ్తారు.]

తెర వాలుతుంది

# రెండవ రంగం

[గోదావరీ తీరం. తడిసినబట్టలతో ఆయాసంతో సరోజనివచ్చి వో యిసుకతిన్నెమీద కూలబడుతుంది. వెనుకనుంచి దుఃఖరసంతో కూడుకున్న పాట. మరోవైపునుంచి నీలకంఠ ప్రసాద్, గౌరీపతి, వాలంటీర్లు పాటపాడుతూ ప్రవేశిస్తారు.]

నీల : అలా చూడండి. గౌరీపతిగారూ! అక్కడెవరో వో స్త్రీ దుఃఖ పడుతున్నట్లుంది.

గౌరీ : అవునౌను. యెవరో వరదబాధితురాలు లాగనేవుంది. అందులో స్త్రీకూడాను. కొంత bussiness అయ్యే లాగుంది.

నీల : ఊఁ. పాట పాడండి. జెండాలు పైకెత్తండి.

[వాలంటీర్లు పాటపాడుతూంటే అందరు సరోజని దగ్గర కొస్తారు.]

నీల : ఎవరమ్మా మీరు? యెందుకలా దుఃఖ పడుతూన్నారు?

గౌరీ : పాపం. ఎవరో వరద బాధితురాలుగా వుంది. (సరోజని మెడవైపుచూచి నీలకంఠ ప్రసాద్‌కు సైగచేసి) పాపం యెవరో గొప్పయింటి ఆడపడుచుగా కనిపిస్తూంది.

[సరోజని సిగ్గుతో తలవంచుకొని అవతలకు పోయి నిల్చుంటుంది.]

నీల : యేమ్మా! మీకుకూడా గోదావరి వరదలవల్ల ప్రమాదం కలిగిందా!

గౌరీ : చెప్పమ్మా చెప్పు. భయపడకు. వీరు వరదబాధితుల్ని రక్షింప అవతరించిన ఆవేదండ వరదులే. చూడమ్మా! ఆ జెండాలను, ఈ డబ్బాలనూ! యెంతసేవ చేస్తున్నారో!

సరో : ప్రమాదమని తిన్నగా అంటారా బాబూ! నాకుమాత్రం, మావారు మా సర్వస్వము, యీ వరదలలో కొట్టుకు పోయినాయి. నేనూ గొంతువరకూ మునిగిపోయి ఉక్కిరి బిక్కిరి అవుతూంటే వోపడవ కన్పించింది. ఆ పడవ వాడు యెంత జాతిగుండె కలవాడో కాని, నోటమాటరాక చేతులతో నమస్కారముచేస్తూ, ప్రాణాలు కాపాడమని ప్రతిమాలుతూంటే అయిదు రూపాయలిస్తే దరికి చేరుస్తా నని వ్యాపారం మొదలుపెట్టాడు. నోట ముక్కున నీరు పోసుకోవడంచేత సరేనన్నట్లు తల ఊపితే లాగి పడ వలో పారేసి అయిదురూపాయ లిమ్మని నిర్బంధించ సాగాడు. అకస్మాత్తుగా ప్రమాదంలోపడిన మాదగ్గర డబ్బెక్కడనుంచి వస్తుంది చెప్పండి? ఆ పడవవాడి వైఖరిచూస్తే, డబ్బివ్వకపోతే తిరిగి గోదావరిలో త్రోసే లాగవున్నాడు. అపుడు వ్రేలివుంగరం వాడికి అయిదు రూపాయలకిందయిచ్చి వొడ్డునపడ్డాను. నిద్రాహారాలు లేకుండా, రెండు రోజుల నుంచి మా వాళ్ళకోసం తిరిగీ తిరిగీ ఆయాసం జాస్తి కావడంచేత యీ యిసుక తిన్నె మీద పడివున్నాను.

గౌరీ : యెంత ప్రమాదం సంభవించింది.

నీల : గౌరీపతిగారూ! నేను పార్లమెంట్ మెంబరుగావున్న నా నియోజకవర్గంలోనే పడపవాళ్ళిలా ప్రవర్తిస్తున్నారంటే, యిది యెంతమాత్రం సహించకూడని విషయం. Next పార్లమెంట్ సెషన్స్‌లో యీ విషయం Move చేసి, ఈ సందర్భాలను విచారించేందుకు ఒక కమిటీని వేయించి వీళ్ళపని పట్టిస్తాను. ప్రాణాలు పోయ్యేవాళ్ళను, డబ్బుకు నిర్బంధిస్తారా! వింటుంటూనే కళ్ళకు నీళ్ళొస్తున్నాయ్.

గౌరీ : కాకపోతేమటుకు నాలుగూ, ఐదూనా!

సరో : బాబూ! మీరెవరో చాలా దయగలవారుగా కనిపిస్తున్నారు. నామీద దయవుంచి, మావాళ్ళ జాడా యేమైనా తీయగలరా స్వామీ!

నీల : (దుఃఖాన్నభినయిస్తూ) పాపం. యీ అమ్మాయి యెవరో గుమ్మందాటి బయటికొచ్చిన మనిషి గా లేదు. యీమెను చూస్తుంటే, నా కడుపు తరుక్కుపోతూంది. చూడండి! గౌరీపతిగారూ! యెలా క్షణంలో పండంటి సంసారాలు పాడయి పోయినాయో! యెలా తల్లులకు పిల్లలు, పిల్లలకు తల్లులు, భార్యలకు భర్తలు, భర్తలకు భార్యలూ దూరమై, అల్లాడి పోతున్నారో!

గౌరీ : ముందు యీమెను మనఆశ్రమానికి తీసుకెళ్దామ్. తర్వాత నిమ్మళంగా మిగతా విషయాలు చూచుకోవచ్చు.

సరో : నా విషయాని కేమొచ్చేలేండి. ముందు నా కుమార్తె సంగతి, వారివిషయం, మేమయిందో విచారించండి. మీకు పుణ్యముంటుంది.

గౌరీ : అమ్మా! చూడండి యీ ప్రాంతానికంతకూ, సంభవించిన ఘోరప్రమాదంలో మీరొకరు. యీ వెల్లువల్లో బుడగల్లాగా వాళ్ళెక్కడ పోయినారో, యెవరు చెప్పగలరు? ఆ గోరంత ఆయుర్దాయము చక్కగావుంటే వాళ్ళుకూడా యేదో వో లాగా బయటి పడివుంటారు. మీరు ముందు నీలకంఠ ప్రసాద్‌గారి శరణాలయానికి వచ్చేయండి. త్వరగా వాళ్ళసంగతి విచారిద్దామ్.

సరో : వాళ్ళ విషయం యేదో తేలేవరకు నామనస్సుకు శాంతి దొరకదు. నేనైనాపోయి వెతుకుతాను. ఎల్లుండి మా శ్యామల పుట్టినరోజు. అమ్మా! శ్యామలా! యిక నీ పుట్టినరోజు సముద్రములోనా తల్లీ! (దుఃఖపడుతూ) నన్ను పోనివ్వండి. ఈ దుఃఖాన్ని నేను భరించలేను. ప్రాప్తముంటే మా వాళ్ళను కలుసుకుంటాను. లేకపోతే నేనూ, ఆ గోదావరీ గర్భంలో కలిసిపోయి, స్వర్గంలోనైనా మావాళ్ళను కలుసుకొని సుఖపడతాను. అందరిని పోగొట్టుకొన్నతర్వాత నేనొక్కదాన్ని మాత్రం బ్రతికేమి ప్రయోజనం?

గౌరీ : నే నోవిషయం చెప్తానువినండి. మీ ఒంటెమీద యింత సొమ్ము వుంది. ఆడవారు, యిలా ఒంటరిగా వెళ్ళడం

అంత క్షేమకరమైన విషయంకాదు. నీలకంఠ ప్రసాదు గారు, ఆర్తులను కాపాడడానికే అవతరించారు. అందు చేతనే భగవంతుడు వారిని మీకు చూపించాడు. భగవ దాజ్ఞను వుల్లంఘించకూడదు. యేఁమ్ పంతులుగారూ ! మాట్లాడరేఁ. (రహస్యంగా) రెఁడుమూడు వేదాంతపు ముక్కలను విసరండి సార్.

నీల : అమ్మాయి యిలాచూడు. కానివేళ వచ్చేసరికి ఆ సీతా, ద్రౌపదీ అంతవారికే కష్టాలుతప్పలేదు. మనం కేవలం మానవమాత్రులం. యేం చెయ్యగలం చెప్పు. కష్టాలు వచ్చినప్పుడే ఓర్పు తెచ్చుకోవాలి. మా శరణాలయానికి వెళ్దాం, రామ్మా ! నీవు అక్కడవుందుగాని. మీ వాళ్ళను గురించిన భోగట్టా అంతా నేను విచారిస్తాను.

సరో : మీ మాటలు చూస్తూంటే ఆపరమేశ్వరుడే మిమ్మల్ని నా దగ్గరకు పంపించాడని తోస్తూంది. మునిగినా తేల్చిన మీకాళ్ళకు చుట్టాకుంటున్నాను. తల్లయినా, తండ్రైనా మీరే. పదండిబాబూగారూ.

గౌరి : ఆఁ రండివెళ్దాం. ఒరే అబ్బాయిలూ, పాడుతూపదండిరా !

[అందరూ పాడుతూ వెళ్తారు.]

తెర వాలుతుంది

# మూడవ రంగం

[గోదావరీతీరం. హిమకరబాబు శోషపొయ్యే శ్యామలను నడిపించు కొంటూ ప్రవేశించి, ఆమెనొక ఇసుకదిబ్బమీద పడుకోబెట్టి తాను పక్కనకూర్చొని, నాల్గువైపులా దీర్ఘంగా పరికించి చూస్తాడు.]

హిమ: అంతా నిర్మానుష్యమైపోయింది. పంటపొలాలు పాడు దిబ్బలైనాయి. పండంటి సంసారాలు పటాపంచలైనాయి. ఒకరి దిక్కు ఒకరికి తెలీదు. ఒకరి చావు ఒకరికి తెలీదు. అంతా దైవలీల. యీ సృష్టి చరమ పరిణితులనుగురించి, క్షణకాలం ఆలోచిస్తే, మానవుడు యింత దుర్మార్గుడు కాడు. అన్ని వేదాంతాల సారాన్ని, యీ దృశ్యమే తెలుపు తూంది. క్షణం క్రిందట పరస్పర భేదాభిప్రాయాలతో కలహించు కొంటూన్న మానవజాతి ఆ గోదావరీతల్లి ఒక్కసారి కన్నెఱ్ఱ జేసేసరికి, ఆ తల్లి ఒడిలో దీర్ఘ నిద్రపోయి, అన్ని విభేదాలను, మఱచిపోయారు. ఇంత స్వల్పశక్తిగల మానవుడు, బ్రతికుండే క్షణకాలంలో తోటిమానవులను పీల్చి. పిప్పిచేసి సామ్రాజ్యాలను నిర్మించడానికి ప్రయత్నిస్తుంటాడు. అందులోనూ మా నాన్నగారిది మరీ విపరీతమైన ప్రకృతి. చేస్తున్నది న్యాయవాదవృత్తి చేసే అన్యాయాలు లెక్కలేవు. చది వింది వేదాంతం. యీాయనలో వున్నంత స్వార్థం యే మానవుడిలోనూ కనుపించదు. ప్రజాసేవకుడని పేరు.

యీనకన్నా ప్రజలను పీల్చి పిప్పిచేసే మనిషి మరొకర్ని చూడలేము. యెడ తెరిపి లేకుండా, త్యాగంమీద ఆరు గంటలు వుపన్యసిస్తాడు. యీ నాడు తోటి మానవుల ఆర్తతమీద వ్యాపారం చేస్తున్నాడు. యీనకున్న ధన పిపాసలో యీన హృదయం ఘనీభవించిపోయి, హృదయమే లేనివాడైనాడో, లేక ఆ బ్రహ్మదేవుడు, యీ ప్రకృతిగల మానవులను వేరేమన్నుతో సృజించాడో తెలీదు. ఉన్న ఒక్క కొడుకునుకూడా యిల్లు వెళ్ళగొట్టె. యీ సంచులుకట్టే ధనమంతా యెవరికోసమో ?

శ్యామ: ఊఁ· ఊఁ. ఆకలి. దాహం. (మూలుగుతుంది.)

హిమ: యేమ్మా ! ఆకలా ! యేం చెయ్యగలం చెప్పు. యిదంతా నిర్మానుష్యమైన యిసుకదిబ్బ. యిక్కడ ఒక మెతుకు కూడా దొరకదు· యెటుపోతే యేవూళ్ళున్నాయో, అసలు ఊళ్ళువున్నాయో. లేదో గూడా తెలీదు. నీకు కొంచెం ఆయాసం తగ్గితే మళ్ళీ ప్రయాణం సాగిద్దాం. నీ అదృష్టం బాగుంటే, త్వరలో మనమేదైనా ఒక ఊరు చేరవచ్చు. అక్కడెవరినైనాఅడిగి యింత అన్నం పెట్టిస్తాను. లేక పోతే మనయిద్దరంకూడా అందరితోపాటు యీ గోదావరి గర్భంలో కలసిపోదామ్.

శ్యామ: నీవలా అనకు. నీ కేం కర్మం. మా అమ్మా నాన్నా పోయినతర్వాత నేను బతకడమెందుకు ? నీదారిన నువ్వు పో. నేను మా అమ్మా, నాన్నా దగ్గరకు పోతాను.

హిమ: అలా అనకమ్మా! నా శరీరాన్ని బంగారంతోనూ, నీ శరీరాన్ని మట్టితోనూ చెయ్యలేదా పరమేశ్వరుడు. అందరి ఆపదలు ఒక్కటే. యేదైనా సమీపగ్రామం నేనైనా చేరవలసిందేగా! సాధ్యమైనంతవరకు నిన్ను నాతో చేర్చడానికి ప్రయత్నంచేస్తాను. లేకపోతే, మనయిద్దర్ని యిప్పుడావరించివున్న ఆపద ఒకటే. మెల్లగా లేమ్మా, వెళ్దాం.

[శ్యామలను మెల్లగా నడిపించుకుంటూ హిమకరబాబు వెళ్తూంటే మురుగన్ యెదురొస్తాడు.]

మురు: ఎన్నా అప్పా! ఆయమ్మ అందమాదిరి పడిపూడుస్తుంది. ఎన్నా?

హిమ: గోదావరి వరదలలో పాపం యీ అమ్మాయి కొట్టుకుపోతూంటే, రక్షించి తీసుకొస్తున్నాను. పాపం యీ అమ్మాయికి రెండురోజులగా అన్నంలేదు. అందుచేత శోషపోయి పడిపోతూంది.

మురు: ఏమప్పా! రెండు రోజుల్నుంచి అన్నం లేకపోతే ఒక సాంబార్ పేకెట్ అయినా కొనిపెట్టకూడదా! మీఆంధ్రా వాళ్ళద రొంబా గట్టిమనుషలు.

హిమ: సాంబార్ పేకెట్లు యిక్కడ యెలా దొరుకుతయ్.

మురు: దుడ్డువుంటే కొండమీద కోటిద వచ్చును. మనం సాదం పేకెట్లు అమ్మడానికిద వచ్చియుంటిమి.

హిమ: శ్యామలా! నీ అదృష్టం బాగుంది. పాపం యితనెవరో సాంబార్ పేకెట్లమ్ముతున్నాడు. కూర్చో తిందుగాని.

శ్యామ: మనదగ్గర డబ్బేదీ!

హిమ: అవును. డబ్బువిషయం నాకు తోచలేదు సుమీ! అవి ఒక్కొక్క పేకెట్ యెంత?

మురు: అంజరూపాయ్‌ద.

హిమ: అయిదు రూపాయలా! పట్టెడన్నం అయిదురూపాయలా! పొరపాటు. అయిదు అణాలేమో!

మురు: ఇల్లే, ఇల్లే, అంజిరూపాయ్‌ద. వేణుమా, వేండ, వర్రు వార్తద పొళ్లు.

హిమ: పట్టెడన్నము అయిదురూపాయలా! ఈ విధంగా దోపిడీ చేసిన డబ్బు మీకు దక్కుతుందా!

శ్యామ: (మూలుగుతుంది.)

హిమ: పాపం. యీ పిల్ల ముఖం చూడు. అన్నంలేక శోష పోయింది. ప్రాణాలుతోమాత్రం, వరదలోనుంచి బయట బడ్డ మా దగ్గర డబ్బెక్కడనుంచి వస్తుంది?

మురు: అదుకు నాన్ యెన్నా సేయడం. నేనుద గోదవరి Food Relief Food Factory కి sole agent ద. నమక్ twenty five Percent (25·/.) కమీషన్‌ద. అసలు పొమ్మ అయ్యకుద పోవాల.

హిమ: ఆ అసలయ్య యెవరు?

మురు: వేదాంత శిరోమణి నీలకంఠ ప్రసాద్ బార్‌గళ్.

హిమ: (తనలో) మానాన్నా ! యెంత హీనంగా, యెంత దయా దాక్షిణ్యాలు లేకుండా డబ్బు సంపాదిస్తున్నాడు. (మురుగన్‌తో) చూడు. అయన్ను నేను బాగా యెఱుగుదును, ఒక్క సాదం పేకెట్ యివ్వు. నే నాయనకు చెప్తాను.

శ్యామ: (మూలుగుతుంది.)

హిమ: ఆ లేత ప్రాణాలు హరి అనేటట్లున్నాయి. నీవు మనిషివి కావు ? నిన్నొక్కడచంపి, ఆ అన్నం పేకెట్లన్నీ లాక్కుంటే నీ వేం చెయ్యగలవ్ ? ఇదేనా మానవత్వం ? యీ విధంగా యెవరికి బలంవుంటే వారు తోటివాళ్ళను దోచుకోని తినడమేనా యీనాటి ధర్మం ?

మురు: అందుకు నాన్ యెన్నాశేయడం ? నమక్ టైమ్‌యిల్లే. పోయిట్ వరేం.

హిమ: కొంచెమాగు. అవును నీవేమిచేయగలవు ? మాకు బుద్ధి వుండాలి. (ఆలోచించి) సరే పోనియ్. ఒక్కసాయం చెయ్యి యీ వుంగరం తీసుకొని, ఒక్కప్యాకెట్ యివ్వు. హిమకరుడు తన వుంగరాన్ని ఒకపేకెట్ అన్నంకోసం యిచ్చాడని ఆ వేదాంత శిరోమణిగారికి చెప్పు. అలా చేస్తావా !

మురు: అదిసరి. అదిబంగారందానా !

హిమ: చూడు.

మురు: (ఉంగరం తీసుకొని చూచి) సరి. నీవేమోచెప్తివి. మేము తీస్తిమి. ఒణ్ణెన్నా ! నాలుగెత్తుకోండిమీ ! మీరుకూడా

ఖోంచెయ్యండిసార్ ! (మురుగన్ నాలుగు సాదం పేకెట్లిచ్చి వెళ్తాడు.)

హిమ: కూర్చోశ్యామల. అన్నంతిందువుగాని.

శ్యామ: నాకొద్దు. నీ వుంగరం నా కోసం అమ్మవద్దు.

హిమ: యీ వ్యామోహమే మానవుల్ని తరతరాలుగా రాక్షసులుగా మారుస్తూంది, మనబుద్ధి యెంత బుగ్గైయిపోయిందంటే మానవునికి యెందుకూపనికిరాని యీ బంగారం మీద వ్యామోహం ప్రాణం పొయ్యేసమయంలో కూడా విడిచిపెట్టలేకున్నాడు. యీ బంగారం యీ సమయంలో యెందుకైనా పనికొస్తుందా ! ఇన్ని యుద్ధాలు యిన్ని రాజకీయాలు యీ పనికి మాలిన బంగారం కోసమేగా సాగుతూంది. యీ బంగారంమీద మమకారం చావనన్నాళ్ళు యెన్ని శాంతిసభలు జరిపించినా, అశాంతి తప్ప, మరేమీ మిగలదు. కూర్చో అమ్మా ! కూర్చొని అన్నంతిను. ప్రయాణం సాగిద్దాం

[శ్యామలా హిమకరులు అన్నంతింటానికి కూర్చుంటారు.]

తెర వాలుతుంది

## నాలుగవ రంగం

[నీలకంఠ ప్రసాద్‌గారు చదువుకునేగది. ఆయన కుర్చీలో కూర్చొని వుంటాడు. కొంచెం ఆవతలగా సరోజని దుఃఖపడుతూ కూర్చొని వుంటుంది.]

నీల : అమ్మా సరోజనీ నీ వలా దుఃఖపడడంవల్ల ప్రయోజనం యేముంది? భగవద్గీతలో కృష్ణభగవాను డేమన్నాడు, అటు చచ్చినవారికోసంగాని, యిటు బతికున్నవారికోసం గాని దుఃఖించడంకన్నా పామరలక్షణం లేదన్నాడు. యెప్పుడు దొరికిన అవకాశాన్ని అప్పుడు వుపయోగించు కోవడమే మానవుడి ధర్మమన్నాడు. యీ సిద్ధాంతం మీదనే నేను (Theseus) థీసేస్ రాసి P. H. D. డిగ్రీ సంపాదించాను.

సరో : ఎలా మఱచిపోగలను చెప్పండి బాబుగారూ! యీ ప్రమాదం జరిగిన నాటిరాత్రి నా చిట్టితల్లికి వుతికిన పావడాకట్టి పెరటిలోని బొండు మల్లెలనుకోసి తలలో పెట్టి బొట్టుపెడుతూంటే తనకా పావడావద్దని సిల్కు పావడా కావాలని మారంవేస్తే అవతలి గదిలోనుంచి దాని నాన్నగారువచ్చి యెల్లుండి దాని పుట్టినరోజుకు కొత్త సిల్కు పావడా తెస్తానని బుజ్జగించి నిదుర బుచ్చారు. దాని పుట్టినరోజు పండుగ యెంతో బాగా చేసు

కోవాలని మరిచిపోయాం. తెల్లవారేసరికి మా సంసార మీ విధంగా విచ్ఛిన్నమై పోయింది.

సీల : అంతా విధివిలాసం. మనం నివసించే యీ ప్రకృతంతా ఒక గాజుకొంప యే క్షణానైనా చిట్లిపోయేదే. ఇపుడు వెనుకటి విషయాలను స్ఫురణకు తెచ్చుకోని దుఃఖ పడడంవల్ల శరీరాన్ని శుష్కింప చేసుకోవడంతప్ప మిగిలేదేమీలేదు. గోపికాక్రీడల్లో ఆ గోపికలకు భగవాను డేమని సెలవిచ్చాడు. సర్వం మఱచిపోయి, దేహాభి మానం వదలి తనకు నమస్కరిస్తే మోక్షప్రాప్తి కలుగ చేస్తానన్నాడు. అలాగే వెనుకటివన్నీ మఱచిపోయి దేశ సేవమీద మనస్సు నిలిపి జన్మ సార్థకం చేసుకో. తెలిసిందా !

సరో : నాకెందుకు లేండి. సగంకాలం గడచిపోయింది. నన్నిలా దుఃఖించి దుఃఖించి యీ శరీరం వదలనీయండి. యీ జన్మలో యేడ్చిన యేడుపైనా ఆ భగవంతుని హృదయం కరిగించి మరోజన్మలోనైనా నన్ను నాభర్తదగ్గరకు చేరుస్తాడేమో !

సీల : తండ్రివంటి వాణ్ణికనుక చెపుతున్నాను. మమకారం కొంత చంపుకోవాలి, గాజుకొంపవంటి యీ లోకంలో నివసిస్తూ, అశాశ్వతమైన యీ దేహానికి సంబంధించిన బంధువులనుగురించి అదేపనిగా దుఃఖించడంకా పురుష లక్షణం. (దగ్గరకు జరిగి భుజంమీద చెయ్యివేసి బుజ్జ

గిస్తాడు. సరోజిని కొంచె మవతలికి జరుగుతూంది.)
భయపడకమ్మా! నన్నోరకంగా మీ నాన్నగారినోరకంగా
భావించకు. (బుజ్జగిస్తూ) యేదో ఒకనాడు అంతా చావ
వలసినవారమే. చూడమ్మా! అలా అని యెప్పటి
జాగ్రత్త అప్పుడు తీసుకోకుండా వుండకూడదు. ఇన్ని
నగలు ఒంటిమీద వుంచుకొని, నీ వీ విధంగా ఒంటరిగా
వుండడం అంత క్షేమకరమైన పనికాదు. నేను యెప్పుడూ
యేదో ఒకపనిమీద తిరుగుతూంటాను. చుట్టుపక్కల
పొరుగంత మంచిది కాదు ఇనప్పెట్టెలో దాస్తా నిస్తా
వామ్మా! (సరోజని చూచి వూరకుంటుంది) నీ కేదైనా
అనుమానమువుంటే వద్దమ్మా! నీదగ్గరే వుంచుకో.

సరో : ఇంత ఉపకారం చేసిన మిమ్మల్ని అనుమానిస్తానా
చెప్పండి బాబుగారూ! నా నగసొమ్ములు దాచినా, నా
శీలాన్ని రక్షించినా, మా వాళ్ళ దగ్గరకు నన్ను చేర్చినా,
అన్నిటికీ మీరేగదా బాబుగారూ! నా కింకెవరున్నారు.

నీల : నాకుమాత్రం యెవరున్నారు తల్లీ! ఉన్న ఒక్కకొడుకు
మొన్ననే నాతో పోట్లాడి ఇక యీ యింట్లో అడుగు
పెట్టనని వెళ్ళిపోయినాడు.

సరో : ఎందుచేత?

నీల : ఎందుచేతని చెప్పనూ! కర్మచేత. నేను చేసేపనులన్నీ
వాడికి గిట్టడం లేదట. యీ అనాధలను, బీద బిక్కలను

ఇల్లుచేర్చి ఆస్తంతా తగలేస్తున్నానట. ఇదంతా విష పూరిత వాతావరణంగా వున్నదట.

సరో : మీరు చేసే మానవసేవ అతనికంత కంటకంగావుందా !

నీల : అంతా దైవలిఖితం. (దగ్గరకువచ్చి బుజ్జగిస్తూ) యేవమ్మా! ఆ నగలు పెట్లోపారేసి, పోయి ఆ వరద బాధితుల కన్నఫానాలు సరిగా అమిరాయొ లేదో చూచిరావాలి.

సరో : (నగలిస్తూ) మీ అబ్బాయి యిక రానేరాడా !

నీల : రానేరాడటతల్లీ ! యేం చెయ్యను వృద్ధుడనైపోయినానన్న కనికరంకూడా లేదు వాడికి. ఇవి ఇనప్పెట్లెలోపారేసి వస్తానమ్మా ! ఇతరులసొమ్ము విషంతో సమానంగా చూడమని పెద్దల నుడికారంవుంది.

[నీలకంఠ ప్రసాద్ వెస్తూంటే వెనుకనుండి తమ్మన్న ప్రవేశిస్తాడు.]

తమ్మ : అయ్యయ్యో ! పిచ్చితల్లీ ! యెంత పొరపాటు పడ్డావమ్మా ! ఆ వున్ననగలుకాస్తా ఆడిమొగాన పెట్టేశావ్. ఇంకెలా బతుకుతావమ్మా యెఱ్ఱితల్లీ !

సరో : (ఆశ్చర్యంగా) అదేమిటితమ్మన్నా ! అయన్ను అలా అంటున్నావ్.

తమ్మ : యీడు రుద్రాచ్చ పిల్లెని తెలుసుకోలేక పొయ్యావు గదమ్మా ! గోదావరిలో చావబొయ్యే వాళ్ళదగ్గర నాలుగూ, ఐదూ లెక్కన సంపాయించే వీడినా నమ్మడం. సినబాబుగారు చాల మంచోరు. యీనగారు చేసేపనులు అయనకుగిట్టక యింట్లోనుంచి యెల్లిపొయ్యారు. ఇకేం

ముంది ? చేతుల్లో యేసుకొనేమటుకు యేసుకున్నాడు. ఇంక నిన్నుకూడా బయటికి తరిమేస్తాడు. అప్పుడెలా బతుకుతావమ్మా యెఱ్ఱితల్లీ !

సరో : అయ్యో భగవంతుడా ! మొసలి నోట్లోనుంచి తప్పించి, పెద్దపులినోట్లో పడేశావే ఇప్పుడేంగతి ? తమ్మన్నా నీకు నమస్కారము చేస్తాను. నాకేదైనా దారి చూపించు.

తమ్మ: చేయి జారిపొయ్యాక యేంచేద్దామ్ చెప్పమ్మా ! ఇంకైనా కొంచెం జాగ్రత్తగా వుండమ్మా ! తర్వాత ఆలోసిద్దాం. అదిగో, ఆడు వస్తున్నాడు. నేవెళ్తా. నేనిలా మాట్లాడానని ఆడితో అనకమ్మా ! యేదో ఒక దొంగకేసులో ఉరి కించి పానాలు తీసేస్తాడు, ఇదివర కెంతమందినో అలా చేసాడు.

[తమ్మన్న వెళ్తాడు. నీలకంఠ ప్రసాద్ ప్రవేశిస్తాడు.]

నీల : సరోజనీ యెవరితో మాట్లాడుతున్నావ్.

సరో : యెవరూలేరు తమ్మన్నతో.

నీల : యేవిషయం ?

సరో : (భయంతో) యేవో........వెనుకటి........విషయాలు.

నీల : ఓహో ! అలానా ! నీకోవిషయం గట్టిగా చెప్పాలని వచ్చాను. నీవు దిక్కులేనిదానివని ఆశ్రయమిచ్చాను. నీవు నా ఆశ్రయంలో వుండదలచుకుంటే నాకు తెలీ కుండా నా నౌకర్లతోనూ, చాకిర్లతోనూ అనవసరంగా

రావకార్యాలు చేయగూడదు. (వెళ్ళిపోతూ వెనక్కుతిరిగి) మరోవిషయ మేమిటంటే ఇవ్వాళ వంటమనిషి రాలేదు. నీవిలా వలపోసుకుంటూ కూర్చుంటే నీకూ, మాకూ కూడా యెలజరగాలి ? మాయింట్లో వున్నందుకు నీవు మాకుకూడా కొంచెం సాయపడాలి.

సరో : (భయంతో) ఏమిటి యిలా మాట్లాడుతున్నారు ?

నీల : (నవ్వి) యేమీలేదు. జరగవలసిందేదో చెపుతున్నాను. అంతేఁ.

[బెస్త వెంకన్న ప్రవేశించి డబ్బు, నగలు, బల్లమీద పెడతాడు.]

నీల : (చూచి కోపంతో) ఇవ్వాళ వసూలైంది యివేరా. దొంగ వెధవ. నీవు కాజేస్తున్నట్లున్నావ్.

వెంక: మీ దగ్గర నౌకరీ సేస్తున్నందుకు ఆ సావబొయ్యేవాళ్ళను దోసుకోవడమే కాకుండా, అందులో భాగంకూడా పంచుకోవాలా బాబూ !

నీల : (సరోజనిని చూచి వెంకన్నతో) నోరుమూయ్. నీ యిష్టం వచ్చినట్లు వాగుతున్నావే. ఒళ్ళు దగ్గరపెట్టుకోని ప్రవర్తించు తెలిసిందా ?

వెంక: మీరేగా బాబూ ! మొదలుపెట్టింది.

నీల : నీవెందుకమ్మా యిక్కడ ? లోపలికిపోయి వంట మొదలు పెట్టక.

సరో : (లోనికి వెళ్తుంది)

సీల : ఆ అమ్మాయి అక్కడ వుండగానే నీ యిష్టంవచ్చినట్లు వాగుతున్నావే. పరువుతీసేశావ్. నీకెం ఉద్యోగంమీద ఆశలేదా !

వెంక: ఇంక యీ ఉద్యోగం వద్దని చెప్పడానికే వచ్చాను బాబూ !

నీల : (ఆశ్చర్యంగా) అఁ.

వెంక: సినబాబుగారు గోదావరికాడ కనిపించారు.

నీల : ఊఁ. హూఁ. కనిపించారూ ! ఆ గోదావరిలో మీఇద్దరూ కలిసిపోలేకపొయ్యారా !

వెంక: అందరూపొయ్యాక మీరొక్కడుమాత్రం స్మశానంయేల్తారా బాబయ్యా !

నీల : డబ్బనేది వుండాలెకాని, యిలాంటి చిన్నబాబులు, వందల కొద్దీ వస్తారా !

వెంక: ఆయనోపిల్ల పానాలు రచ్చించడానికి పానాలు పోగొట్టుకో డానికి సిద్ధమయ్యాడు. ఒకర్నొకరు పట్టుకోని మునక లేత్తుంటే ఆ సమయానికి ఆడకి నా పడవవచ్చింది. ఆ మునిగిపోయేది సినబాబుగారని తెలీక, పదిహేను రూపాయలిస్తే బయటేస్తానన్నాను. తీరా పడవలోకిలాగి సూసేసరికి సినబాబుగారు. ఆపైన ఆయన నన్ను సివాట్లు పెట్టి యిలాంటి పాడుపనులు సెయ్యద్దని మందలించాడు. అప్పుడాయనన్న మాటలు యిప్పటికీ నా సెవుల్లో గింగురుమంటున్నాయ్. ఇంక నాకీ వుద్యోగ మొదు

బాబూ! గోదావరి ఒడ్డునపోతే పెజలు కొరతనే సేటట్టు న్నారు. మీ సొమ్ము మీ కొప్పజెప్తాను. సెలవుబాబూ! యీ వుద్యోగం చాలు.

[బెస్త వెంకన్న వెళ్తూంటే నీలకంఠం ఆశ్చర్యంగా చూస్తూ]

నీల : వెంకన్నా!

వెంక: (వినిపించుకోకుండా వెళ్తాడు.)

నీల : (కోపంతో) కన్నకొడుకే గర్భశత్రువైనప్పుడు మరొకర్ని గురించి అనుకోవాల్సిందేముంది? డబ్బు సంపాదించక పోతే వీడి ఆదర్శాలకూ, విలాసాలకు, షికార్లకు డబ్బె క్కడనుంచి రావలనో వీడివుద్దేశ్యం. ఒకడు ఉచ్చనీచాలు లేకుండ సంపాయిస్తుంటేనే మరొకడు ధర్మసూత్రాలు వల్లెవేస్తూ, కూర్చోగలిగేది. వీడి ప్రవర్తన మొదటినుంచీ యిలాగేవుంది, అయితే వీడు నన్నేంచేస్తాడు కన్ను తెరవని కుంక. కాకపోతే వారసత్వంకూడా పోగొట్టుకుంటాడు.

[వెనుకనుంచి గౌరీపతి ప్రవేశిస్తాడు.]

గౌరీ : అంతే. అంతే. అంతకన్నా యింకేంచేస్తాడు. విన్నారా! మీరు వసూలుచేసే వరదబాధితుల నిధంతా వడ్డీ వ్యాపా రానికి పోతూందట. వెనుక వసూలైనదానికి లెక్కలు తీసుకోని సొమ్మంతా సద్వినియోగం అయ్యేలాగున చూడ మని ప్రభుత్వాని కర్జీలు పోయినావట.

నీల : ఆఁ. ప్రభుత్వాని కర్జీలు పెట్టాడా!

గౌరీ : అయితే మనకేం భయంలేండి. హోం మినిష్టర్ మనకు అంతరంగిక మిత్రుడేగా ! ఆ అర్జీలు మనల నేమి చేస్తాయ్.

నీల : ఆ విషయం అలావుంచి, కన్నకొడుకే యిలా ప్రచారం చేస్తే యింకముందు మనకు కానీ యిచ్చేవా రుంటారా ! గౌరీపతిగారూ !

గౌరీ : ఎందుకివ్వరండీ ! ఒకటి రెండు సభలు జరిపించి గాంధీ గారి సూత్రాలమీదనో, విశ్వమానవ శాంతిమీదనో, అదీ కాకపోతే రామాయణ భారత కథలమీదనో రెండుమూడు వుపన్యాసాలు దంచేశారంటే వాళ్ళేయిస్తారు. వేదాంత శిరోమణులైన మీకు అసాధ్యమేముంది చెప్పండి. ప్రభుత్వంలో యింత పలుకుబడి సంపాదించుకున్న మీమాట చలామణి కాకపోతే, "కసరుకాయ" అతని మాట చలామణి అవుతుందా ! అంతగా పైకొస్తే కమ్యూనిష్టుకింద అరెష్టు చేయిద్దాం. మనకు పోలీసుల్లోమాత్రం పలుకుబడి లేకపోయిందా !

నీల : (నవ్వి) మనిషంటే మీరేనండీ ! ఒక్కసారి వీడిమీద గట్టిగా చర్య తీసుకోకపోతే వీ డిలాగే చెలరేగి పోతూంటాడు. యేమంటారు ?

గౌరీ : మొక్కై వంగందీ, మానై వంగుతుందా !

నీల : అదే నేననేది.

[తమ్మన్న టెలిగ్రాము తెచ్చి నీలకంఠ ప్రసాద్ చేతికిచ్చి వెళ్తాడు.]

నీల : (చదివి) యేమందోయ్ గౌరీపతిగారూ! చూచారా! కొంపమునిగింది. రేపుమధ్యాహ్నం వరదలమంత్రిగారు 7—53 నిముషములకు విమానంలో కర్నూలునుంచి బయలుదేరి 8—15 నిముషములకు రాజమండ్రిచేరి అక్కడ వరదలవల్ల చచ్చిపోయిన వారిసంఖ్య తేల్చుకొని 9—45 నిముషములకు గోదావరీ తీరంలో బహిరంగ సభలో వుపన్యసించి 11—20 నిముషములకు భోజనాలకు మనయింటికి వస్తున్నారట. వీరు యెంతమంచివారను కున్నారు. వీరి సాయంమూలాన్నే నేను చివరివరకు **Food Committee President** గా వుండగలిగాను. ఆఁ. చూడండి! ఇల్లంతా మూడురంగుల జెండాలతో అలంకారంచేసి హాలులో ఆ కొత్త గాంధీగారి బొమ్మ పెట్టించండి. మన వాలంటీర్ల అందరినీ సిద్ధంచేసి గుమ్మంలో వారు కారు దిగేసరికి "తా" మని జాతీయ గీతం మొదలుపెట్టించండి. తెలిసిందా! అన్నిపనులూ త్వరత్వరగా కావాలి. వెళ్ళండి.

గౌరీ : అసలు వీ రెందు కొస్తున్నట్లు?

నీల : (కొంచెం విసుగ్గా) వరదప్రాంతాల పర్యటన కొస్తున్నారు. మీకు కొత్త రాజ్యాంగవిధానం తెలీదు. వేపుకు తింటు న్నారు. మీరుకూడా కనీసం ఒక షష్టగ్రేడు ప్లీడరైనా బాగుండేది, వారు గోదావరీ ప్రాంతమంతా పర్యటనంచేసి చచ్చిపోయిన వారి సంఖ్యతేల్చి చావబొయ్యేవాళ్ళను

వాళ్ళతోకలిపి మిగతా వుండేవాళ్ళకు సమానంగా ఆహార పదార్థాలు పంపిణీ అయ్యేందుకు తిరిగి రేషన్‌పెట్టించి కనీసం మూడు లక్షల బస్తాల ధాన్యమైనా ఒక కమిటీ ఆధీనంలోవుంచి మనిషికి మూడౌన్సుల చొప్పునైనా రేషన్లు సమానంగా అందేలాగున చూస్తారు.

గౌరీ : ఆ కమిటీ ప్రెసిడెంటు బహుశా మీరే ననుకొంటాను.

నీల : మరి యింకెవరనుకొన్నారు ; మనంత చదువు, మనంత బలుకుబడి యీ ప్రాంతాలలో యెవరికుంది ?

గౌరీ : ఆపైన పార్లమెంటుమెంబరూ ; నిజంగా యీసారికూడా మీరే ప్రెసిడెంట్ అయితే మూడౌన్సుల రేషన్ సమానంగా పంపిణీ చేయబడి ఆంధ్రదేశంలో నిరుద్యోగ సమస్య నిర్మూలమైపోయి సుస్థిరశాంతి స్థాపించబడుతుంది.

నీల : మరి యెంతకష్టపడితే విశ్వమానవశాంతి యేర్పడాలి చెప్పండీ ; దీనికేంగాని జరగాల్సిందేదో ఆలోచించండి వెళ్ళి.

గౌరీ : ఓ చిన్నవిషయం మీతో మనవిచెయ్యాలని ఆలోచిస్తున్నాను. యీ వరదల సందర్భంలో గట్టిగా పనిచేస్తే వచ్చేసొమ్ములో పావలా వాటాఅయినా తప్పక యిస్తానని మాట యిచ్చివున్నారు. యింతవరకు ఆ విషయం ప్రస్తావనకేరాలేదు. అందుచేత..........

నీల : రామాయణంలో పిడకలాటలాగున అదీ ఇప్పుడేనా ! తర్వాత చూచుకుందామ్లేండి. వెళ్ళండి. యేదో ముట్టి జెప్పక పోతానూ !

గౌరీ : (వెళ్ళుతూ తనలో) యేదో ముట్టజెప్తావా ! అడ్డమైన చాకిరీ చేయించి, ఆడగూడని అబద్ధాలన్నీ ఆడించి ! కానీలే, నీవెక్కడికి పోతావ్. (వెళ్ళిపోతాడు.)

నీల : వీడికి డబ్బుమీద మహాకాంక్ష. వీడిని ఒకకంట కనిపెట్టి వుండాలి. అమ్మాయ్ సరోజనీ !

సరో : యేం బాబుగారూ

నీల : (ఆలోచనతో) యేమీలేదు. లోపలికిపద. వంటయింట్లో మాట్లాడుకుందామ్.

[ఇద్దరూ వెళ్తారు]

తె ర వా లు తు ం ది

# అయిదవ రంగం

[సరోజని కూర్చొని కూరలు తరుగుతూంటుంది. హడావుడిగా నీలకంఠ ప్రసాద్ ప్రవేశిస్తాడు.]

నీల : అమ్మాయి సరోజనీ! నీవు మా యింటికొచ్చినవేళ చాల మంచిది.

సరో : మావాళ్ళ కబురేమైనా తెలిసిందా బాబుగారూ!

నీల : ఆఁ. ఆఁ. అదికాదు. ఆవిషయమే విచారించేందుకు వరదల మంత్రిగారికి టెలిగ్రామ్ యిచ్చి పిలిపించాను. వారువచ్చి చచ్చిపోయినవారిసంఖ్య బతికున్నవారిసంఖ్య తేల్చేస్తారు. అపుడు మీవాళ్ళవిషయంగూడా తేలిపోతుంది.

సరో : నిజంగానా, బాబుగారూ! మంత్రిగారే స్వయంగావచ్చి విచారిస్తారా? అయితే మా అమ్మాయిని మళ్ళీ చూస్తాను. మీ ఋణం యెలా తీర్చుకోగలను బాబుగారూ!

[గౌరీపతి పక్కన నిల్చుని వింటూంటాడు.]

నీల : మంత్రిగారు స్వయంగా వస్తున్నారుగనుక వారి విషయమంతా నీవే స్వయంగా చూచుకోవాలి. మర్యాదల్లో యేమాత్రం లోటు రానివ్వకూడదు. నీవు చేసే పరిచర్యల్లో, వారు పరిపూర్ణంగా తృప్తిచెందాలి.. అప్పుడు కాని మన వుభయులకోర్కెలూ ఫలించవు.

సరో : అయ్యో మీరింతగా చెప్పాలా బాబుగారూ! నేనూ గొప్పయింటి ఆడబడుచనే గొప్పయింటికే వెళ్ళాను. మా

యింటికీ అనేకమంది అధికార్లు వస్తూ, వెళ్తూ వుండేవారు. వాళ్ళకెలా మర్యాదలు చెయ్యాలో నాకూ బాగాతెలుసు.

నీల : అదికాదమ్మా! యీ నాటి ప్రపంచమర్యాదలు వేరు. అన్నివిషయాలలోను పాశ్చాత్య నాగరికత బలిసిపోయింది. పాపం నీవో యీనాటివరకూ గుమ్మంలో నుంచి బయటికొచ్చిందానివి కావు.

సరో : (కళ్ళనీళ్ళు తుడుచుకుంటుంది)

నీల : యేదవకమ్మా! యేదవకూ. యేం చెయ్యగలమ్ చెప్పు. ఎందుకు చెప్పొచ్చానంటే యీకాలంలో మన సాంప్రదాయాలన్నీ మండిపోయినయ్. మగ, ఆడ, విచక్షణే లేకుండాపోయింది. అందుచేత మగవాళ్ళు ఆడవాళ్ళను, ఆడవాళ్ళు మగవాళ్ళను రాచుకుంటూనే తిరుగుతుంటారు. తనవాళ్లు పరాయివాళ్లు అనే భేదమేలేకుండ మట్టూ, మర్యాదా లేకుండా—"సరోజీ" "సుశీ" "శశీ" అని యేవేవో పొట్టిపేర్లతో పిలుస్తూంటారు. అలాంటి సమయాల్లో నీవేమైనా బాధపడతావేమోనని ముందుగా చెపుతున్నాను.

సరో : దానికేంలెండి పెద్దవారు యెలాపిలిస్తే తప్పేముంది లెండి. మా నాన్నా, మా అన్నయ్యలూ నన్నెన్నిసార్లు తాకుతూ తిరగలేదు. అందరూ నన్ను సరోజీ అనే కురచ పేరుతోనే పిలిచేవారు.

నీల : అదుగది, నీవలా సర్దుకుపోవాలి అందుచేతనే వేదాంతంలో కార్యసాధకులకు సహనం చాలా అవసరమన్నారు. వస్తా నమ్మా! వారిని పిల్చుకువస్తాను. (కొంతదూరంపోయి వెనక్కు తిరిగి) వారు వచ్చినపుడు నీవిషయం అంతగా ప్రసక్తి తేవలసిన అగత్యంలేదు యెందుచేతనంటే, నేను యిదివరకే, వారికి నీ విషయం రాసివున్నానుగనుక పదే పదే ఆగొడవే చెప్తూంటే బాగుండదు. ఆఁ చూడు మరి...........నాకూ వో చిన్న వుపకారం చెయ్యాలి!

సరో : అంతకంటేనా! యెందుకలా నీళ్ళు నములుతారు చెప్పండి.

నీల : అబ్బే యేమీలేదు. ఇది కేవలం నాకే వుపకారంకాదు. దేశానికంతకూ వుపకారమే. యీ వరదలవల్ల ధాన్య మంతా నష్టమై పోయింది గదూ! అందుచేత తప్పక రేషన్‌పెట్టి ఒక ఫుడ్‌కమిటీని నియమిస్తారు. ఆ ఫుడ్ కమిటీ ప్రెసిడెంట్‌గిరి యేదేశ ద్రోహి చేతికోపోతే, వాడు ధాన్యమంతా బ్లాక్‌మార్కెట్‌లో అమ్ముకొని ప్రజలను మాడ్చేస్తాడు. అందుచేత ఆ ప్రెసిడెంట్‌గిరి మరొకరికి పోకుండా, మనకే వచ్చేలాగున మాటలసందున వోమాట వెయ్యి. తెలిసిందా!

సరో : వారు నాతో అంత మనసిచ్చి మాట్లాడడం యెలా జరుగు తూంది. ఒకవేళ అలా జరిగితే యీ మాట చెప్పడంలో తప్పేముంది? అలాగేలెండి.

నీల : ఆఁ. ఆఁ. అదే నేనూ చెప్పేది. మరి వస్తాను.

[నీలకంఠం వెళ్ళిపోతాడు. మరో వైపునుండి గౌరీపతి ప్రవేశిస్తాడు.]

గౌరీ : (తనలో) వరదబాధితులపేరుతో సంపాదన అయింది. ఇప్పుడు మళ్ళీ ఫుడ్‌కమిటీ ప్రెసిడెంట్ పేరుతో మరో దోపిడీ దొచెయ్యాలని చూస్తున్నాడు. అందుకు సాధనంగా పాపం యీ అమాయికురాలిని వుపయోగించుకోవాలని చూస్తున్నాడు. నా కిదివర కెన్నెన్నో ఆశలు పెట్టి, యిలాంటి దుర్మార్గా లెన్నింటిలోనో వుపయోగించుకొన్నాడు కాని సంపాదించిన లక్షల్లో, రాగిదమ్మిడీ అయినా నా కివ్వలేదు. రాను రాను యితని ప్రవర్తన చూస్తూవుంటే యింత ఉచ్చనీచాలు లేకుండా సంపాదించేవాడు నా కేమిస్తాడానిపిస్తూంది. వీడి నేదైనా ఒక ఒత్తిడిలో పెత్తేకాని మందిమనకు రాలిపోదు. ముందీ సరోజని నిక్కడినుండి తీసికెళ్తాను. తర్వాత ఆయన విషయ మాలోచిస్తాడు. (సరోజనితో) అమ్మా! సరోజనీదేవిగారూ! మిమ్మల్ని చూస్తూంటే నాకు చాలా జాలి వేస్తుంది. పాపం భర్తను, కుమార్తెను గోదావరి కర్పించి ఒంటెమీద నొమ్ము యీ వృద్ధ జంబుకం పాలు జేసి, శ్రీరామ! శ్రీరామ! చివరకు..........

సరో : (భయంతో) యేమిటి గౌరీపతిగారూ మీరు చెప్పేది? యీ యింట్లో ఒకరిమాట కొకరిమాటకు సంబంధంలేదు.

ఇంతపేరు తెచ్చుకొన్నవాడు, నలుగురిలో తిరుగనేర్చిన వాడు ఆడదాని సొమ్ము అపహరిస్తారంటారా !

గౌరీ : పాశ్చాత్యులు మనకీ బిరుదులు తగిలించి ఒకర్నొకరు మోసము చేసుకోమనే! సొమ్ముమింగేసి అంతటితో వదిలేస్తే సంతోషమే.

సరో : ఇంకేం చెయ్యాలనుకొంటున్నాడు ? తమ్మన్నకూడా యీన విషయంలో చాలా జాగ్రత్తగా వుండాలని హెచ్చ రించాడు. నాకేమీ అర్థంకావడంలేదు. మీకు నమస్కారం చేస్తాను, నన్ను మీ చెల్లెలుగా భావించి నాకు నిజం చెప్పండి. నాభర్తా పిల్లల్ని వెదికించడానికి వరదల మంత్రిగార్ని పిలిపిస్తున్నానన్నారే ! అదెంతవరకునిజం ? ఆయనకు నన్నేదో చెప్పమంటారే. ఆడదాన్ని నేనేంది ఆయనకు చెప్పేది.

గౌరీ : (నవ్వి) వీరి ఆహ్వానముమీద వారు రావడములేదు. ఆయనే వస్తున్నారు. ఆ అవకాశాన్ని యీన పునస్క రించుకొని ఆయన్ను యింటికి విందుకుపిలిచి అతి రూప వతివైన మిమ్ములను వుపయోగించుకొని, రేషన్‌కమిటీ ప్రెసిడెంట్ కావాలని ప్రయత్నిస్తున్నాడు. అంతేకాని మీ భర్తా పిల్లల్ని వెదికించడానికి యీయన పిలిపించడం లేదు. వారు రావడంలేదు.

సరో : (నిర్ఘాంతపోయి) అర్థమైంది. పెద్దవాడు, స్వార్థత్యాగి యని పేరుతెచ్చుకొన్నవాడు యింత నీచానికి పాలు

పడతాడా! గౌరీపతిగారూ! మీకాళ్ళకు నమస్కారము చేస్తాను. ముందు నన్ని ఇంట్లోనుంచి బయటపడెయ్యండి. నే నొక్క క్షణమైనా యీ యింట్లో వుండలేను. నా సొమ్మంతా పోతేపోయింది. ఆయన రాకముందే నన్నిక్కడనుండి పంపించండి.

గౌరీ : నేనూ ఆదే ఆలోచిస్తున్నాను. ముందు మా యింటికి వెళ్దాం రండి. తర్వాత ఆలోచించుకోవచ్చు. త్వరగా బయలుదేరండి. మళ్ళీ ఆయన వచ్చాడంటే వీలుండదు.

సరో : సరే పదండి.

గౌరీ : త్వరగా రండి.

[గౌరీపతి సరోజనీ వెళ్తారు.]

తెర వాలుతుంది

# ఆఱవ రంగం

[గౌరీపతిగారి యిల్లు. సరోజని వలపోసుకుంటూ కూర్చుని వుంటుంది.]

సరో : ఇది యెన్ని జన్మాల పాపమో, యీ జన్మలో అనుభవిస్తున్నాను. పూర్వజన్మలో యే ఆలుమగళ్ళకు, యే తల్లి పిల్లలకు యెడబాట్లు కలుగచేశానో యీ జన్మలో అది కట్టి కుడుపుతూంది. ఇంతమందిని ఒక్కసారిగా మింగ గలిగిన ఆ గౌతమికి నే నొక్కదాన్నిమాత్రం యెక్కువైనట్లున్నాను. మా శ్యామలకూడా యే పుణ్యాత్ముని చేతనైనా రక్షింపబడగూడదా ! వట్టిమాటలు. ఆ వెల్లువల్లో యెవరిప్రాణాలు వాళ్ళే కాపాడుకోలేని సమయంలో యెవరు కాపాడతారు ? నా వంటి పాపాత్ములుమాత్రం ఈ దుఃఖం యెల్లకాలం అనుభవించేందుకు బతికి బయట బడతారు. (కంట తడిబెడుతుంది.)

గౌరీ : (ప్రవేశించి) ఎన్నాళ్ళు దుఃఖించి యేం ప్రయోజనముంది చెప్పండి.

సరో : ఇంక నాకేంసుఖం నాయనా !

గౌరీ : ఎందుకు సుఖంలేదు. అనుకుంటే అంతా ఆనందమయమే. ఆదేపనిగా పోయినవాళ్ళకోసం దుఃఖిస్తూ కూర్చుంటే అంతా దుఃఖమయమే. నాకూ భార్యా, పిల్లలూ లేరు. నేను ఆనందం అనుభవించడంలేదూ ! చెప్పండి ?

సరో : ఇదివరకెన్నడూ పిల్లలమీద ప్రేమ తెలియక పోవడంచేత నా దుఃఖం నీకు అర్థంకాదు నాయనా !

గౌరీ : తెలిసి మీరిపుడు చేయగలిగిందేముంది ? పోయినవాళ్ళ నేమైనా తేగలరా ! భగవంతుడు యెప్పుడేది ప్రసాదిస్తాడో దానిని సర్వవిధాలా వుపయోగించుకొని బతికిన నాలుగురోజులూ, హాయిగా కాలక్షేపంచేసి, అవతలికి దాటిపోవడమే జీవిత పరమావధిగా పెట్టుకోవాలి. లేక పోతే బతుకున్న దుఃఖమయమై పోతాయి. మీ కుమార్తె మీ భర్త చనిపోయినారని మీరు దుఃఖిస్తున్నారే యేదో ఒకరోజున మీరూ, నేనుమాత్రం పోకతప్పుతుందా ! చెప్పండి. కాకపోతే ముందు, వెనుక అంతే. ఈ భాగ్యాని కెందుకిలా బంగారంవంటి శరీరాన్ని పాడుచేసికొని అలమటించి పోవడం.

సరో : నిజమే. నిజమే. ఇంకా యెక్కడైనా బతికున్నారనే ఆశే యీ దుఃఖానికి కారణం. ఇంక వాళ్ళకు నేనూ, నాకు వాళ్ళూ లేరని గుండె ఱాయిచేసుకుంటే, యే దుఃఖమూ వుండదు. (గుడ్డతో కళ్ళు తుడుచుకుంటుంది) ఇంక యింత భగవన్నామం చేసుకుంటూ యీ జీవిత శేషాన్ని గడిపేస్తాను.

గౌరీ : (తనలో) పైత్యానికి మందిస్తే వాతంగమ్మినట్లుంది. (సరోజనితో) ఆ వయస్సుమాత్రం రాకపోతుందా ! చెప్పండి. ఇపుడు మీకున్న సహజసౌందర్యంతో లోకా

న్నంతా భ్రమింపజేసి, అనుభవించి, ఆనందించవలసిన యీ యౌవనంలోనా, యీ వైరాగ్యం.

సరో : ఏమిటి గౌరీపతిగారూ! మీభావం

గౌరీ : యేముందీ! యేమీలేదు. యేమీ ప్రకృతి విరుద్ధమైంది కాదు. తోడూ నీడా లేక, యెండిపోయిన యెడారిజీవితం నాది. అందర్నీ పోగొట్టుకొని అల్లాడి పోతున్న జీవితం మీది. అందుచేత దుఃఖ భాజనమైన మన యెడారి జీవితాలు రెండు తిరిగి చిగిర్చి పచ్చబడాలంటే, అన్యోన్యము ప్రేమభావాలు కలుగచేసుకోవాలి.

సరో : (వణకిపోతూ గౌరీపతిని చూచి మోకరించి నమస్కారము చేసి) నీమీద ప్రేమెందుకు లేదన్నయ్యా! నీమీద ప్రేముండడంచేతనేకద యీ దిక్కులేని దీనావస్థలోకూడ నీ యిల్లు చేరింది. చెడివచ్చిన చెల్లెల్ని అలా అనవచ్చునా బాబూ! శెలవు. వస్తా. (వెక్కి వెక్కి యేడుస్తూ వెళ్తూంటుంది)

గౌరీ : సరోజనీ యెక్కడికివెళ్తావ్. ఆ నీలకంఠ ప్రసాద్ కంట బడ్డావంటే నీగతేమౌతుందో చూచుకో.

సరో : ఎవరు యెలా వుపయోగించుకోడానికైనా, ఇకముందు యీ సరోజని యీ శరీరంలో కనిపిస్తేకదూ!

గౌరీ : అంటే.

[తమ్మన్న ప్రవేశిస్తాడు. సరోజని అతని కాళ్ళమీద పడుతుంది. గౌరీపతి వెనక్కు తగ్గుతాడు. తమ్మన్న సరోజనిని లేవనెత్తి]

తమ్మ: మళ్ళీ యే మొచ్చిందమ్మా ! యిలా యేడుస్తున్నారు.

సరో : తమ్మన్నా ! ఇక తల్లైనా, తండ్రిఅయినా నీవే. యిప్పుడు నీవే నన్ను కాపాడాలి.

తమ్మ: అసలు యిసయమేందమ్మా !

సరో : ముందు నన్నిక్కడనుంచి బయటికి తీసికెళ్ళు. తర్వాత చెప్తాను. వస్తానన్నయ్యా ! రా తమ్మన్నా వెళ్దామ్.

తమ్మ: అంత తొందరెందుకమ్మా ! అసలు యిసయం చెప్పవమ్మా!

గౌరీ : యేముందీ యెప్పటి మామూలు విషయమే.

సరో : అంతేలే. రా తమ్మన్నా. ముందు బయటికివెళ్ళి తర్వాత మాట్లాడుకుందామ్.

తమ్మ: సరే పద.

[సరోజని తమ్మన్నా వెళ్తారు. గౌరీపతి చూస్తూ నిల్చుంటాడు.]

తె ర వా లు తుం ది

## ఏడవ రంగం

[గోదావరీ తీరం. హిమకరుడు, శ్యామలా అలసిపోయి కాళ్ళీడ్చు కుంటూవచ్చి ఒక యిసుక దిబ్బమీద కూలబడతారు.]

హిమ: ఎంత ఘోరప్రమాదం సంభవించిందీ గోదావరీ తీరవాసులకు. ఇంత ఘోరవిపత్తు సంభవిస్తుందని కలలోకూడా అనుకోనుండరుకదా! శ్యామలా! యిలాంటి దృశ్యాలు చూచినప్పుడైనా మానవుడు తాను యెంత స్వల్పశక్తి కలవాడో ఆలోచించుకో లేడుకదా! తాను యీసృష్టి అంతమయ్యేవరకు బతికేవుంటానని భావించి అహర్నిశలూ, ఉచ్చనీచాలు లేకుండా ధనార్జనకే జీవితమంతా వ్యయం చేస్తూవుంటాడు. ఇది యీనాటి మానవ ప్రకృతి.

శ్యామ: ఇంక యీరోజుకు మనం పనిచెయ్యలేమే హిమకర బాబూ! అలుపొచ్చేస్తుంది.

హిమ: అవును మనమిద్దరం మాత్రం రెండోసాయం లేకుండా. యెంతమందినని దేవి బయటబడెయ్యగలం? ఒకరా. యిద్దరా! అప్పటికీ శక్తివంచనలేకుండా బయటికి చేర్చ గలిగినంత మందిని చేరుస్తున్నామ్.

శ్యామ: అయినా ఆ నీలకంఠ ప్రసాదు యెవరు హిమకరబాబూ! అంత పీనుగులమీద పిండాకూడు తింటున్నాడు.

హిమ: (తలవంచి) ఆయన యీ ఊరిలో ఒక గొప్ప ధనికుడు. వేదాంతి. సుప్రసిద్ధ న్యాయవాది. పైపెచ్చు ప్రజా సేవకుడూను.

శ్యామ: ఇలాంటి దేశసేవకులంతా కుక్కగొడుగుల్లాగా, దేశమంతా బలసిపోబట్టే, దేశంలో యిలాంటి ఉత్పాతాలు పుట్టుకొస్తున్నాయ్.

హిమ: ఈ విధంగా వుత్పాతాలు పుట్టుకురావడంకూడా ఒక విధంగా మంచిదే. యేమంటే, బతికుండీ యీ అవకతవక దేశభక్తుల చేతులలో, కొంచెం కొంచెంగా చచ్చిపొయ్యేకన్నా! ఒక్కసారి మానవజాతి దీర్ఘనిద్ర పోతుంది. కనుక మనం గోదావరిలో కొట్టుకు పొయ్యే వాళ్ళను బతికించి వోవిధంగా అపకారం చేస్తున్నామ్.

శ్యామ: నిజం. నిజం. అలా అని మనలాంటివాళ్ళం చూస్తూ ఊరుకోలేం. యెవరో ఆ నీలకంఠ ప్రసాదుగారివంటి వేదాంతులు తప్ప.

హిమ: యీ యిసుక దిబ్బమీద కొంగు పఱచుకోని పడుకో శ్యామలా! అంతా అంధకారంగావుంది. తెల్లవారిన తర్వాత యెక్కడైనా గుక్కెడు గంజిదొరికితే తాగి మళ్ళీ మన చేతనైన సాయం చెయ్యడానికి ప్రయత్నిద్దామ్.

[ఇద్దరు గుడ్డలు పరుచుకొని పడుకొంటారు. మరోవైపునుండి తమ్మన్న సరోజని ప్రవేశిస్తారు.]

సరో: ఇంకవెళ్ళు తమ్మన్నా! నీ వుపకారం యెన్ని జన్మాలకూ మఱచిపోను. ఇంక నాదారిన నేను వెళ్తాను.

తమ్మ: యీ కటికచీకట్లో యాడకి పోతావమ్మా! యీ రాత్రి మా గుడిసెలోవుండి, రేపు నీ యిష్టంవచ్చిన చోటికి

పోదువుగానని యెంత బతిమలాడినా, యినకుండా వచ్చే
శావ్, నా మాటయిని యనక్క పోదాంరాతల్లీ!

సరో : క్షమించు తమ్మన్నా! నీ మాట కాదన్నాననుకోకు. నా
మనస్సిప్పుడు యే ప్రాణినీ నమ్మలేకుండా వుంది. అంటే
నిన్ను కూడా సందేహిస్తున్నా ననుకోకు. ఆ ప్రాంతాలలో
వుంటే షుష్కీ నీలకంఠ ప్రసాదుగారికికాని, ఆ గౌరీపతి
గారికికానీ, కనుపిస్తే యింకేమైనా వుందా! నీవు వెళ్ళు.
నాకర్మ యెలావుంటే అలా జరుగుతుంది.

తమ్మ: యేం చేసేది. సరే నీ యిష్టం, నిన్నీ అర్ధరాత్రియాళ
యీ గోదావరొడ్డున ఒదిలేసి పోవడానికి మనస్సొప్పడం
లేదు. పెద్దోణ్ణి గనుక ఆఖరిమాట సెప్తున్నాను. వినుకో
అమ్మా! నిరాశతో పానాలు తీసుకొనే ప్రయత్నం
మాత్రం సెయ్యాక. కట్టాలు కలకాలం కాపరం సెయ్యవ్.
నీకు నమ్మకముంటే మా యింటికి రా అమ్మా! నిన్ను
నా కన్నకూతురులా సూసుకుంటాను.

సరో : చావనేదేనాకుంటే, ఆనాడే నాభర్తతో పోయివుండేదాన్ని.
కనుక అలాంటి ప్రయత్నం యేమీ చెయ్యను. చేసినా
ప్రయోజనంలేదూ,

తమ్మ: అదమ్మా! అది. మీ వాళ్ళెక్కడైనా బతికుంటే అదృష్ట
ముంటే కలుసుకోవచ్చు. వెళ్ళొస్తానమ్మా! (తమ్మన్న
వెళ్ళిపోతాడు)

సరో: (తమ్మన్న వెళ్ళినవై పే చూస్తూ) తమ్మన్న వెళ్ళిపోయి నాడు. అంతా అంధకారం. అంతా నిరామయం. నాకు ఆ మనుషులలో వుండేకన్నా ! యీ ఒంటరితనంలోనే యెంతో ధైర్యంగావుంది మానవజాతిలో మానవత్వమే నశించిపోయింది. ఆడది ఒంటరిగా కనుపిస్తే దాని నన్ని విధాలా అవమానపఱచి భ్రష్టనుచేయడమే యీనాటి ధర్మమైంది. ఇలాంటి పాడుసంఘంలో జీవించేకన్నా యీ ఒంటరితనమే హాయిగా వుంది. (కొంచెమాలోచించి) తెల్లవారితే మళ్ళీ మానవసంఘంలోకి పోవల్సిందేగా ! మానవులేలేని ప్రపంచ మెక్కడుంది ? యింత చులకనగా యీ సంఘంలో బతికిమాత్రం ప్రయోజన మేముందీ ? ఎవరికోసం బతకాలి ? నేనింక యీ ప్రపంచంలో చేయవలసిందేముంది ?

హిమ: (వింటూంటాడు)

సరో: యీ నాటి సంఘంలో అనాథనై జీవించేకన్నా, ఆ గోదావరీ గర్భంలో కలసిపోవడమే మేలు. " నా " అనువారు లేకుండా జీవితయాత్ర గడపలేము. అమ్మా ! శ్యామలా ! నీదగ్గరికే వస్తున్నాను తల్లీ ! (నడుముకు పమిటబిగించి) దయామయా ! మా కుటుంబమంతకూ యీ బలవన్మరణమే విధించావా స్వామీ ! అంతా నీదయ.

[గోదావరిలో పడబోతూండగా హిమకరుడు అడ్డుతగిలి ఆపుతాడు.]

హిమ: ఎవరమ్మా మీరు ? ఎందుకిలా బలవంతంగా ప్రాణాలు తీసుకోడానికి ప్రయత్నిస్తున్నారు.

సరో : (భయంతో తనలో) నా కష్టాలింకా తీరలేదాస్వామీ ! యీ యెడారిలోకూడా ఈ అర్ధరాత్రి సమయంలో పురుషు లను ప్రయోగించావా స్వామీ ! యీ చివరి ఘడియలలో కూడా యెందుకు ఈ విషమ పరీక్ష.

హిమ: ఏమమ్మా మాట్లాడరు ? ఎందుకిలా వంటరిగా వచ్చారు ? మీకొచ్చిన కష్టమేమిటి ? చెప్పండమ్మా ! నాచేతనైనంత వరకూ సహాయము చేస్తాను

సరో : సహాయము చేస్తానంటున్నావా బాబూ ! (నవ్వి) వాళ్ళూ అలాగే అన్నారు. పోనీ, నీ మాటకూడా చూద్దాం.

హిమ: తప్పక చేస్తానమ్మా ! యేంకావాలి ?

సరో : నిజంగా నాకు సహాయం చేసేట్లయితే నన్ను ఈ నిశ్శబ్ద ములో హాయిగాయేడ్చి, ఈ శరీరాన్ని వదలనియ్యి. అంతకన్నా నాకేసాయమూ అవసరములేదు.

హిమ: అదేమిటమ్మా అలా అంటున్నారు ? చచ్చినతర్వాత మనం చేయగలిగిందేముంది ? మీ మనస్సుకేదో మానని గాయం తగిలినట్లుంది.

సరో : బతికుండిమాత్రం ఈ మొండికట్టె చేసేదేముందని చని పోదా మనుకున్నాను. భర్తను, కుమార్తెను గోదావరి కర్పించాను. నగలన్నీ ఆ నీలకంఠ ప్రసాదుగారి కర్పించి

గౌరీపతిచేత అవమానింపబడ్డాను. ఇంకేముంది బాబూ! ఈ ప్రపంచంలో అనుభవించవలసింది?

హిమ: నీలకంఠ ప్రసాద్‌గారు మీసొమ్ము అపహరించారా! యెంతమందిని దోచుకొన్నా ఆయనదాహం తీరేట్లు కనిపించదు.

సరో: నీలకంఠ ప్రసాదుగారిని మీరెరుగుదురా!

హిమ: ఆయన్నెరుగనివారు యీ ప్రాంతాల్లో వున్నారా అమ్మా! నాతోరండి. రేపు ఆయనదగ్గరకువెళ్ళి మీసంగతి విచారించి చేయదగిందేదో చేద్దామ్.

సరో: గంపంత సంసారమే కూలిపోయిన తర్వాత నాకానగలు మాత్రం యెందుకునాయనా! వాటిని కావాలని నేనెప్పుడూ అనుకోలేదు. దయవుంచి నీ దారిన నీవు వెళ్ళు. నా దారికడ్డురాకు

హిమ: నన్ను మీ సోదరునిగా భావించుకోండి. కష్టాలొచ్చినప్పుడల్లా చస్తూంటే, సుఖాలొచ్చినప్పుడల్లా బ్రతకగలమా! చెప్పండి. నేనూ మీలాగే కష్టా లనుభవిస్తూన్నవాణ్ణి. అక్కడ మరో దిక్కులేనిపిల్ల నిద్రపోతూంది. పాపం ఆ అమ్మాయి నిద్రలేస్తే చీకటిలో భయపడుతుంది. త్వరగారండి వెళ్దాం.

శ్యామ: హిమకరబాబూ! హిమకరబాబూ!

హిమ: ఆఁ. శ్యామలా! వస్తున్నాను. పడుకొన్నచోటనేవుండు. చీకటిలో మారుపడతావు.

సరో: (ఆదుర్దాగా) బాబూ శ్యామలా! యెవరుబాబూ యీ శ్యామల?

హిమ: ఎవరో పాపం తెలియదు. యీ వరదలలో తల్లిదండ్రు లను పోగొట్టుకుంది. ఆ అమ్మాయికూడా మునిగి పోతూంటే మెల్లగా ఒడ్డుకు చేర్చాను. అప్పటినుంచీ మాతోనేవుండి కష్టాలు పడుతూవుంది.

సరో: (తనలో) మా శ్యామల అయివుంటుందేమో!

శ్యామ: హిమకరబాబూ! నాకు చాలా భయంగావుంది. త్వరగారా.

సరో: (తనలో) గొంతుకూడా అలాగేవుంది.

హిమ: అమ్మా! ఆ అమ్మాయి భయపడుతూంది. త్వరగా వెళ్దాం రండి.

శ్యామ: హిమకరబాబూ!

హిమ: అక్కడేవుండు శ్యామలా వస్తున్నాను. అమ్మారండీ.

సరో: పదనాయనా! ఆ అమ్మాయిని నాకుకూడా చూడాలని వుంది.

[ఒకరినొకరు వెతుక్కుంటూ, చివరకు హిమకర శ్యామలలు కలుసు కుంటారు. శ్యామల హిమకరుని చేయిపట్టుకొని ]

శ్యామ: ఎక్కడికెళ్ళావ్ హిమకరబాబూ! నాకు చాలా భయం వేసింది.

హిమ: ఇదిగో యీమెకోసం వెళ్ళాను.

శ్యామ: ఎవరామె ?

సరో: ఇలారామ్మా!. (శ్యామలను దగ్గరకు పిలిచి చూచి గుర్తించి) శ్యామలా!

శ్యామ: అమ్మా !

హిమ: యేమిటీ ! మీఅమ్మా ! ఆహా దైవచిత్రం. క్షణంక్రిందట అంతా నిరాశ. మరుక్షణంలో అంతా ఆనందం.

సరో: అయ్యో నాతల్లీ ! బతికేవున్నావా అమ్మా ! ఇంక యీ జన్మలో నిన్ను చూడగలుగుతా ననుకోలేదు. సుఖంగా వున్నావా అమ్మా ! నాయనా ! నాబిడ్డను నాకు చూపించావు. నీకు పదివేల నమస్కారాలు.

శ్యామ: అమ్మా ! నీవు ఆ వరదలలో కొట్టుకు పొయ్యావను కున్నాను.

సరో: లేదమ్మా ! ఇంకో క్షణం వీరురాకపోతే, అలాగే జరిగేది. బాబూ ! మాకు నీవుచేసిన ఉపకారానికేమి ప్రత్యుపకారం చేయగలం ? అయ్యో ! యెంత చిక్కిపొయ్యావమ్మా !

హిమ: నేను చేసిందేముందిలేండి. అంతాదైవలీల.

సరో: అమ్మా శ్యామలా ! మీనాన్నగారుకూడా మనలాగా యెక్కడైనా బతికివుండకూడదా ! (మంగళసూత్రం చూచుకుంటుంది.)

శ్యామ: బతికే వుంటారమ్మా !

హిమ: తప్పక బతికే వుంటారు. మీరధైర్యపడకండి. నిమ్మళంగా ఆయనజాడగూడా తేలుతుంది. చాల పొద్దు పోయింది. కొంచెం విశ్రాంతి తీసుకొందాం. పడుకోండి:

సరో: అవునమ్మా ! చెరుగు పరుస్తాను పడుకో.

[అందరూ పడుకుంటారు.]

తె ర వా లు తు ం ది

# ఎనిమిదవ రంగం

[నీలకంఠ ప్రసాదుగారి కచేరీచావడి. కోపంతో అటూ, యిటూ తిరుగుతుంటాడు. గౌరీపతి, తమ్మన్న వోవైపు నిల్చుని వుంటారు.]

నీల : నాసొమ్ముతిని నాకొమ్మే గుద్దుతారా ! మిమ్మల్ని చేరదీసి వుద్యోగాలిచ్చి పోషించినందుకు యిదా ప్రతిఫలం. తీరా మంత్రిగారింటికొచ్చేసరికి యెవ్వరూ లేకుండా పోతారా ! ఆ సరోజనిని యెక్కడ దాచారో చెప్పండి. నాయింట్లో వున్నదాన్ని నాకు తెలియకుండా తీసికెళ్తారా గౌరీపతి గారూ ! నాసంగతి మీకు తెలియదూ ? మర్యాదగా పోలీసుల పాలుకాకముందే తీసుకొచ్చి ఒప్పగించండి.

గౌరీ : యేం తమ్మన్నా ! సరోజనిని తీసుకొచ్చి ఒప్పగించు. లేకపోతే పోలీసుల పాలై పోతావ్.

నీల : నేనుచెప్పేది మీకు పర్యాచకంగా వుందా ! గౌరీపతిగారూ! పదివేల రూపాయల సొమ్ముతో లేవదీసికెళ్ళారని యిది వరకే పోలీసురిపోర్టు యిచ్చివున్నాను. తెలిసిందా ! మంచిగా సరోజనిని పిల్చుకురండి.

గౌరీ : పోలీసు రిపోర్టు యిచ్చారా ! బాగుంది. ఇన్నాళ్ళుగా మీరు చేసే కిరాతకాలన్నిటికీ తాళంవేసినందుకు మీ రిచ్చే భాగం యిదన్నమాట.

నీల : మరి నన్ను కన్నుగప్పి నాయింట్లోనుంచి యెందుకు తీసి కెళ్ళారు.

గౌరీ : ఆమెమీద మీకెంత అధికారముందో నాకూ అంతే అధికార మున్నది గనుక. మనం యిద్దరం చూదాం. మీ వాటాకు మీరు సొమ్ము పుచ్చుకొన్నారు నావాటాకు నేను మనిషిని పంచుకున్నాను. నగలకు ప్రాణంలేదు గనుక, మీరు దక్కించుకొన్నారు. మనిషికి ప్రాణముంది గనుక నేను దక్కించుకోలేకపోయాను. ఇందులో మీ మంచేముంది ? నా చెడేముంది ?

నీల : మాటలు చాలా జోరుగా వస్తున్నాయే. సరే కానివ్వండి. ఇంకోగంటలో పోలీసుస్టేషన్‌లో యీ సంజాయిషీ చెప్తురుగాని.

గౌరీ : నేనేకాదు మనిద్దరంకూడా సంజాయిషీ చెప్పుకోవాల్సిన తరుణంవచ్చింది. ఇంతలోనే తొందరెందుకు ?

నీల : నేనుగూడా చెప్పుకోవాలా !

గౌరీ : ప్రజల సొమ్మపహరించిన ప్రతివాడూ చెప్పుకోవాల్సిందే. కాకపోతే ముందు వెనుకలు. అంతే. యీ విషయంలో మనయిద్దరం సమాన భాగస్థులమే.

నీల : ఆ విషయం తర్వాత చూచుకుందామ్లేండి. ముందు సరోజి నెక్కడుందో చెప్పండి.

గౌరీ : మళ్ళీ మొదటిపాఠమేనా ! యేం తమ్మన్నా ! సరోజి నెక్కడుంది ? అయ్యగారికి కోపం వస్తూంది.

తమ్మ : నాకేం తెలుస్తుంది బాబూ !

[తమ్మన్న వెళ్తాడు. సరోజినీ, శ్యామలా, హిమకరులు ప్రవేశిస్తారు.]

హిమ: తమ్మన్న కేంతెలుస్తుంది నాన్నా! ఇదుగో సరోజినీదేవి గారూ, ఆమెకుమార్తె శ్యామలాను.

నీల : వీళ్ళు నీదగ్గరకు చేరారా!

హిమ: వాళ్ళు చేరేదేముంది నాన్నగారూ! దైవం బతికించ దలుచుకుంటే యేదో ఒక తెప్పకొయ్య చూపిస్తాడు.

శ్యామ: అమ్మా! నీలకంఠ ప్రసాదుగారు హిమకరుని తండ్రిగారా!

సరో : నాతోకూడా ఆయన చెప్పలేదుసుమా!

శ్యామ: ఇన్నాళ్ళు మేము కలిసిమెలసి ఒకచోట వున్నాం. నాతో కూడానూ చెప్పలేదు సుమీ!

హిమ: నాన్నగారూ! పాపం వీళ్ళనగలు వీళ్ళకిచ్చెయ్యండి. వీళ్ళదారిన వీళ్ళు వెళ్తారు. ఇప్పుడు మనలను ఆవరించిన దరిద్రాన్ని యీ నగలు తీర్చగలవా!

నీల : దరిద్రమా! నాకా! నాకు దరిద్రంరావాలని పాపం నీవు కోరుకొంటున్నావ్ కాబోలు.

హిమ: దేశాన్నంతటినీ, ఊడ్చిపెట్టిన గోదావరి మనల్నిమాత్రం వదిలేసిందని మీరు భ్రమపడుతున్నట్లున్నారు. కపిలేశ్వర పురం, రాజోలు తాలూకాలలోని మన నాలుగువందల యెకరాలపల్లం తాటిచెట్టెత్తున దిబ్బేసి పోయింది. ఇంక ఇరవై సంవత్సరాలుదాకా సాగుకురాదు. మీరు నర్సాపురంలో రహస్యంగా నిల్వవుంచిన ఆరువందల బస్తాల ధాన్యం ఇంటితోసహా గోదావరి పాలైపోయినాయి.

నీల : ఆఁ. ఆఁ. ఇది నిజమేనా ! (కుర్చీలో వెల్లకిల పడ్తాడు.)

హిమ: అక్కడే మీరు తాకట్టు పట్టుకొన్న రాజుగారి మూడు కొబ్బరితోటలూ చదునై పోయినాయి.

నీల : (దీనంగా నొప్పి నభినయిస్తూ) ఆఁ. ఇదంతా నిజమేనా గౌరీపతిగారూ ! (దగ్గుతాడు.)

హిమ: అబద్ధాలు చెప్పడానికి యిందులో నా కొచ్చేదేముంది నాన్నగారూ !

[తమ్మన్న టెలిగ్రాం తెచ్చి గౌరీపతిగారి చేతికిచ్చి వెళ్తాడు.]

గౌరీ : (టెలిగ్రాం చదివి) గవర్నమెంట్‌వారు బ్యాంకులోవుండే మీ డబ్బంతా జప్తిచేసి దానికాపీని మీకు పంపించారు పంతులుగారూ !

నీల : ఆఁ. ఎందుకు ? (బాధ నభినయిస్తాడు.)

గౌరీ : వెనుక మీరు వయోజన విద్యా ప్రచారసంఘానికి ప్రెసి . డెంట్‌గా వున్నప్పుడు యిచ్చిన రెండులక్షల రూపాయలూ అధికాహారోత్పత్తి సంఘానికి ప్రెసిడెంట్‌గా వున్నప్పుడు బీదరైతుల కివ్వమని యిచ్చిన ఐదులక్షల రూపాయలలో ఒక దమ్మిడీకూడా ప్రజలకు ముట్టలేదనీ, వరదబాధితుల నిధికని డబ్బాలు వసూలుచేసి వడ్డీలకు మారుస్తున్నారని ప్రజలు అర్జీలు పెట్టినమీదట బ్యాంకులోని మీడబ్బంతా జప్తిచేసి మీకు నోటీసు పంపించారు. పై పిటిషన్లకు సంజాయిషీ చెప్పుకునేందుకు 21 వ తారీఖున వాయిదా వేయబడిందట· ఆ తారీఖున మీరు స్పెషల్ జడ్జీదగ్గర

హాజరై Official enquiry లో సమాధానం చెప్పుకో
మని నోటీసు యిచ్చాడు.

నీల : (వణుకిపోతూ) గౌరీపతిగారూ! లెక్కపుస్తకాలన్నీ జాగ్రత్తగా వున్నాయా! అందరిదగ్గరనుంచి ఓచర్లు తీసుకొన్నారా!

గౌరీ : ఒక్కరైనా ఓచర్లిస్తేగదండీ తీసికొనేందుకు.

నీల : (బాధ నభినయిస్తూ) అయితే మనవాటకు O climax కొచ్చిందన్నమాట. పిటిషన్లెవరుపెట్టారు గౌరీపతిగారూ!

గౌరీ : నాకెలా తెలుస్తుందండి. అలా తెలిసేవుంటే యింతవరకూ రానిస్తానా చెప్పండి.

నీల : మీరుకాదూ! నిజంచెప్పండి.

గౌరీ : శివ. శివ. నేనా! మీ ఉప్పు పులుసు తిని, ఇన్నాళ్ళుగా మీ శుశ్రూషచేసి, అలా చేస్తానా చెప్పండి.

నీల : ఈ విషయంలో నే నొక్కడనే బాధ్యుడనని మీరు సంతోషిస్తున్నారు. నాతోపాటు అన్నిట్లో మీరుకూడా భాగస్వాములే.

గౌరీ ; ఆ విషయం నేనే మొదట మనవి చేశానుగదండీ!

హిమ: ఎవరైతే యేంలేండి నాన్నగారూ! ఇప్పుడు జరగాల్సిందేదో ఆలోచించండి.

నీల : (బాధగా నవ్వి) నీవు, యీ గౌరీపతి కలసి ప్రజలు తరఫున వకాల్తా పుచ్చుకొని నన్ను బైటకు పంపిస్తారు

కాబోలు. న్యాయశాస్త్రిలు ఆశుకవిత్వంగా వప్పజెప్ప గలిగిన నన్ను మీరా యెదిరించి నిలిచేది ? నన్ను విచారించడానికి ఒక స్పెషల్ Judge వస్తాడా రానీ. గౌరీ పతిగారూ ! వెళ్లాం రాండి. మంచిచెడ్డలన్నిట్లోనూ నాకు సరైనబంటు మీరే. యీ గవర్నమెంటువారు నన్నెలా పట్టుకోగలరో చూస్తాను.

[నీలకంఠ ప్రసాదు గౌరీపతి వెళ్తూంటే]

తె ర వా లు తుం ది

# తొమ్మిదవ రంగం

[సరోజని, శ్యామల కూర్చొని మాట్లాడుతూ వుంటారు.]

సరో : మీనాన్నగారి జాడే తేలలేదు. ఎక్కడున్నారో యెలా వున్నారోగదా ! హిమకరబాబు వాళ్ళ నాన్నగారి కేసు విషయంలో చాలా ఆదుర్దాగా వున్నాడు. నీలకంఠ ప్రసాదుగారు యీ కేసులోనుంచి బయట పడేవరకు హిమకరబాబును మీ నాన్నగారి విషయం వెదికించ మనడంకూడా భావ్యంకాదు.

శ్యామ: నీలకంఠ ప్రసాదుగారికి శిక్ష తప్పుతుందంటావా అమ్మా !

సరో : యేమో ! భగవంతునిదయ.

[హిమకరబాబు త్వరత్వరగా ప్రవేశించి దిగులుగా ఏదో వెదుకుతుంటాడు]

సరో : యేమిటిబాబూ వెతుకుతున్నావు ?

హిమ: యేమీలేదండీ ! ఇవ్వాళ తండ్రిగారి విచారణరోజు. కొన్ని పేపర్స్ కనుపించకపోతే వెదకుతున్నాను.

సరో : కే సెలావుంది ?

హిమ: ఎలావుందని చెప్పనూ ! ఒకరూపాయా, రెండురూపాయలా ! కొన్నిలక్షలకు miss appropriation జరిగింది. యజమాని కొంతచేస్తే అనుచరులు అంతా చేశారు. ఇపుడందరూ యెదురుతిరిగారు. అందులోనూ

ఆ గౌరీపతి సొమ్ముదిని తొమ్మ గుద్దేడు. డబ్బు కాజేసిందీవాడే. పిటీషన్లు పెట్టించింది వాడే. సమయం వచ్చేసరికి పరారైనాడు.

సరో : తండ్రిగారికి గవర్నమెంటులో చాలా పలుకుబడి వుంది కదూ ! పోనీ, పైవారిచేత యెవరిచేతనైనా సిఫార్సులూ అలాంటివి చేయించకూడదూ !

హిమ: ఇది ప్రజాప్రభుత్వం. పైవారు ప్రజల ఆదరాభిమానాల పైన ఆధారపడి వుంటారు. ప్రజల సానుభూతిని సంపాదించుకొనేంతవరకూ, నాన్నగారివంటివారిని బాగా వుపయోగించుకొని తర్వాత యిలాంటి వేపైనావస్తే, యివతలవాళ్ళెంత అనుకూలమైనవారైనా రచ్చకీడుస్తారు. యీ కాలంలో ప్రభుత్వంకూడా ఒక వ్యాపారంవంటిదే.

సరో : అయితే యిప్పుడు కర్తవ్యమేమిటి ?

హిమ: సాధ్యమైనంతవరకూ పోరాడి చూస్తాం. తరువాత ఆయన నొసటివ్రాత యెలావుంటే అలా జరుగుతుంది. అదీకాక, నాన్నగారికేసు విచారించడానికి ఒక దిట్టమైన Judge ని వేశారు. ఆయన పైవారిమాటలుకాని, క్రిందివారి మాటలు కాని వినేవారు కారట. ఆయనపేరు ఆయన ప్రవర్తనకు తగినట్లేవుంది.

సరో : అయ్యో! ఎలాంటికష్టంవచ్చింది పాపంవారికి వార్ధక్యంలో.

హిమ: " Crime will never pay " అని ఇంగ్లీషులో ఒక ధర్మసూత్రంవుంది. మానవుడు పాపం చేసేంతసేపు యీ సూత్రం బోధపడదు. చివరకు యీ ప్రచండశాస్త్రి వంటి వారెవరో పట్టిచూడడం మొదలుపెట్టేసరికి........

సరో : ఆఁ ప్రచండశాస్త్రిగారా ! ఎవరాయన ?

హిమ: ఇపుడు నాన్నగారి కేసు విచారించే జడ్జీగారి పేరదే.

సరో : ఆఁ. ఆఁ. ప్రచండశాస్త్రిగారా !

హిమ: ఎందుకలా ఆశ్చర్యపోతున్నారు ?

సరో : ఏం లేదుబాబూ ! నన్నుకూడా యివ్వాళ కోర్టుకు తీసి కెళ్ళండి. వారెవరో నేనుకూడా చూస్తాను. (మంగళ సూత్రం కళ్ళకద్దుకొని) శ్యామలా ! త్వరగా బట్టలు మార్చుకొని రామ్మా ! వెళ్దాం.

శ్యామ: సరేనమ్మా !

సరో : పదనాయనా వెళ్దాం.

[అందరూ వెళ్తూంటే]

తెర వాలు తుంది

## పదియవ రంగం

[ప్రచండశాస్త్రి, నీలకంఠ ప్రసాద్ విచారణ జరుగుతూంటుంది.]

ప్రచం: నీలకంఠ ప్రసాదుగారూ ! యీ విధంగా ప్రభుత్వపు సొమ్ము దోచేస్తే ప్రజలకు ప్రభుత్వంమీద యేం విశ్వాస ముంటుంది ? పలుకుబడి సంపాయించుకొని చైర్మెన్‌లు, పార్లమెంట్ మెంబర్లూ అయ్యేదీ ప్రజల కష్టాలను తొలగించడానికి కానీ ప్రజలకు వినియోగించమని యిచ్చిన డబ్బు మింగివేయడానికి గాదు.

నీల ; **I take objection to this speech.**

ప్రచం: తగినంత సాక్ష్యం వుండడంచేతనే నేనిలా **remark** చేస్తున్నాను. మీమీద ఒకలారీకి వేయదగినన్ని పిటిషను లున్నాయి.

నీల : నాకు సరిపడనివారెవరో నామీద యేవో పిటిషనులు పెడితే వాటిని ఆధారంగా తీసికొని ప్రభుత్వంవారు నామీద చర్యతీసుకోవడంకానీ, తమబోటివారిలా వ్యాఖ్యా నము చేయడంకానీ, చాలా శోచనీయమైన విషయం. (డగ్గుతాడు.)

ప్రచం: మరి మీరు లెక్కపుస్తకాలు ఎందుకు దాఖలుచెయ్యరూ ?

నీల : గోదావరిలో కొట్టుకుపోయిన లెక్కపుస్తకాలనుతెమ్మంటే నే నెక్కడనుండి తేగలను ?

ప్రచం: ఇది న్యాయవాదిగావున్న మీరు చెప్పదగిన ప్రత్యుత్తర మేనా ! లెక్కపుస్తకాలూలేవు. తగినంత సాక్ష్యంలేదు కాని మీరుమాత్రం ప్రభుత్వపు సొమ్మును దుర్వినియోగం చెయ్యలేదని చెప్తున్నారు. మీరు చెప్పినంతమాత్రాన మిమ్ములను మేము నమ్మాలి కదండీ ! నీలకంఠ ప్రసాదు గారూ ! మీరు సుప్రసిద్ధ న్యాయవాదులనికానీ, చాలా పలుకుబడి కలవారనికానీ, పార్లమెంటు మెంబరనికానీ, నేనేమీ భయపడేవాడిని కాను. మీరేమైనా సవ్యంగా చెప్తే వాటిని వ్రాసి పంపుతాను. లేకపోతే నాకు తోచిం దేదో నేను వ్రాసేస్తాను.

నీల : నేను మనవిచేసేది తమకర్థంకానందుకు నేను చాలా విచారిస్తున్నాను. ప్రపంచానికంతకూ ఆవాంతరంవచ్చి ఊళ్ళకు వూళ్ళే కొట్టుకుపోతున్న పరిస్థితులలో నేను యీ లెక్కపుస్తకాలుమాత్రం జాగ్రత్త చెయ్యకపోవడం నా అపరాధంకాదు. ఇంక రెండోవిషయంలో నే మనవి చేసేదేమంటే నా సిరిసంపదలుచూచి ఓర్వలేని వారెవరో, నామీద అర్జీలుపెడితే వాటి నాధారం చేసుకోని నావంటి మర్యాదస్తుణ్ణి నడివీధికీడ్వడం ప్రభుత్వంవారు యేమాత్రం చెయ్యవలసిన పనికాదు. నేను ఐదుతరాలుగా చైర్మెన్ చేస్తున్నాను. పార్లమెంట్ మెంబర్ను. సాలుకు అయిదు వేలరూపాయలు income tax కడుతున్నాను. ఇటువంటి వాడినైన నామీదనా ప్రభుత్వం చర్య దీసుకొనేది. మళ్ళీ Elections వస్తే నాదగ్గరకు రాకతప్పుతుందా !

ప్రచం: అవన్నీ నాకు సంబంధించిన విషయాలు కావు. ప్రస్తుతం యీ పిటిషన్లకు మీ ప్రత్యుత్తరం యేమైనావుందా, లేదా !

నీల : లేకపోవడమెందుకు ? అవిపెట్టినవాళ్ళకూ, నాకూ సరిపడదని యిదివరకే మనవిజేశాను. ఆ విధంగానే వ్రాసి పంపించండి. మిగతావిషయాలు నేను High court లో move చేసి చూడగలిగేదేముంది లేండి.

నీల : నాకు సరిపడనివాళ్ళలో ప్రథముడు నా సెక్రటరీయే. అతడికీ, నాకూ యెందుకు సరిపడదు, అనేవిషయానికి అనేక కారణాలున్నాయ్. తమరనుమతిస్తే మనవి చేసుకుంటాను.

ప్రచం: మీరు చెప్పదలచుకుందంతా చెప్పమనేకదా నేను మొదట్నుంచీ చెప్తూంది.

నీల : యీమధ్య నేను వరదబాధితులను నాయింటికి చేర్చి ఆశ్రయమిచ్చిన సందర్భంలో భర్తను, కుమార్తెను పోగొట్టుకొన్న ఒక కుటుంబీకురాలు నా ఆశ్రయంలోకి వచ్చింది. ఆమె నాదగ్గరుంటూండగా, యీ ద్రోహి ఆమెకేవో నామీద లేనిపోని నేరాలుచెప్పి నా యింట్లోనుంచి తీసుకువెళ్ళాడు. అప్పుడామెను, యితనినీ కలిపి నాఇంట్లో పోయిన పదివేలరూపాయల నగలతోసహా, అప్పగించవలసిందని పోలీసు రిపోర్టుయిచ్చాను. పాపమలా తీసుకుపోయిన ఆ యిల్లాలిని అతడేమైనా కాపాడగలిగాడా ! లేదు. అక్కడ ఆమెకూ, అతనికీ యేం తగాదా

వచ్చిందో, ఆమె నానౌకరు తమ్మన్న సహాయంతో అతని యింట్లోనుంచి తప్పించుకొని బయటబడి గోదావరీ తీరంలో ఆ సరోజినీదేవి ప్రాణత్యాగం చేసుకోపోతూంటే నాకుమారుడు రక్షించి కాపాడాడు. ఆక్రోధం మనస్సులో పెట్టుకుని ఆతనీవిధంగా పిటిషన్లు పెట్టాడని మనవి చేస్తున్నాను.

ప్రచం: (ఆశ్చర్యంగా) ఆఁ. ఆమెపేరేమన్నారు ? సరోజనే. ఆమెకేమైనా పిల్లలున్నారని చెప్పిందా ?

నీల : ఒక ఆడపిల్ల వున్నదని చెప్పినట్లుంది.

ప్రచం: భర్త పేరేమైనా చెప్పిందా !

నీల : లేదు,

ప్రచం: నే నామె నొకసారి చూడవచ్చునా !

నీల : ఇప్పటివరకూ మాయింట్లోవుంటే చూడవచ్చును.

ప్రచం: ఉండకెక్కడికి పోతుంది ?

నీల : మంచికి మంచిచేయడం యీ నాటి ధర్మంకాదుకదండీ ! బతికిచెడ్డ యిల్లాలిని చేరదీసేసరికి నాయింట్లో పదివేల రూపాయల నగలు దొంగతనంచేసింది. అది అలా వుండగా నామీదేవో కల్లబొల్లి నేరాలు నాకుమారునికి చెప్పి నాకుమారుణ్ణి నామీదకు తగాదాకు తీసుకొచ్చింది. అందుచేత యిప్పుడు మాయింట్లో వుందో లేదో గట్టిగా చెప్పలేను. (దగ్గి నొప్పి నభినయిస్తూ) అన్నివిషయాలూ

మెలావున్నాయో యీ విషయం అలాగేవుంది. ఇన్నాళ్ళు ప్రజాసేవలో క్షీణించిపోయిన యీ శరీరానికి యీనాడు యీ ప్రజాప్రభుత్వం శిక్షవేయడానికి స్థిరంకాలేదా! అంతాఅంతే. ప్రపంచంలో యీనాడు అన్యాయానికే విద్రోహానికితప్ప స్థానంలేదు.

హిమ: (ప్రవేశించి) నిజం చెప్పారు నాన్నగారూ! ఆఖరు క్షణాల్లోకూడా అబద్ధాలు. అనవసరమైన నిందారోపణలు చేయడమే యీనాటి పెద్దలకు జీవిత లక్ష్యాలైతే, యీ ప్రపంచంలో విద్రోహం, అవనీతితప్ప, యింకేం మిగులుతుంది.

ప్రచం: ఏమిటి? ఆ సరోజనీదేవి విషయంలోకూడా యీ నీల కంఠ ప్రసాదుగారు చెప్పేదంతా అబద్ధమే నంటారా!

హిమ: ఆమె మహాయిల్లాలు. సహనసంపుటి. ఆమెసొమ్ము....

నీల : (క్రోధంతో) నేనపహరించి, ఆమెమీద నేరం ఆరోపిస్తు న్నాను. అంతేగదూ! నీవన్నంతమాత్రాన యేమౌతుంది? (దగ్గుతూ) అందుకు సాక్ష్యమేముంది? నాయింట్లో ఆమె సొమ్ము దొంగిలించినట్లు తట్టెడు సాక్ష్యముంది. నాకు గడ్డంచేస్తూ మంగలి చిలకరాముడు చూచాడు. (దగ్గుతూ) చాకలి కొండడు గుడ్డలు వేయించుకునేందుకు పెరటిలోకి పొయ్యేసరికి గౌరీపతి, యీమె సొమ్ముతోసహా పరా రౌతున్నట్లు సాక్ష్యం చెబుతున్నాడు. చాకలికొండడి సాక్ష మేమంత తీసివేయదగింది కాదు. వాడికి పదివేలరూపా

యలఆస్తి. మూడులాంగ్రీలు వున్నాయి. (తనలో) గుండెలో నొప్పిగావుంది. (దగ్గుతాడు) అదీకాక వాళ్ళిద్దరూ బెదురుతూ బెదురుతూ వీధినబడి పోతూంటే **vice - chairman** గురప్పగారు చూస్తున్నట్లు చెబుతున్నారు. నీకేం, యీ అందరికన్నా బలమైన సాక్షివా! నీకేమైనా ఆస్తిపాస్తులున్నాయా! సంఘంలో పలుకుబడుందా? సాక్ష్యం చెప్పడానికొచ్చావ్ సిగ్గులేక.

ప్రచం: నీలకంఠ ప్రసాదుగారూ! మీరు న్యాయవాదవృత్తిని ఆదర్శప్రాయంగా వుపయోగించుకుంటున్నారండీ!

హిమ: నేను సాక్షమివ్వడానికి రాలేదు. సందర్భ మొచ్చిందిగనుక వున్న యదార్థం చెప్పాను.

నీల : చెప్పేదేదో చెప్పావుగా. ఇంక దయచెయ్.

హిమ: వెళ్తాను. (ప్రచండశాస్త్రిగారితో) యిప్పుడు మానాన్నగారు చెప్పిన సరోజనీదేవిగారూ, ఆమెకుమార్తె మిమ్మల్ని చూడాలని వచ్చారు. మీరు అనుమతిస్తే లోపలికి వస్తారు.

నీల : వీరుకూడా నామీద నేరారోపణ చెయ్యడానికి వస్తున్నారు కాబోలు. రానీ, వీళ్ళంతాకలిసి నన్నేం చేయగలుగుతారో చూస్తాను.

ప్రచం: నాకూ, వాళ్ళను చూడాలనివుంది. రమ్మనండి.

[హిమకరుడువెళ్ళి శ్యామలతో ప్రవేశిస్తాడు. శ్యామల ప్రచండశాస్త్రిగారిని చూచి]

శ్యామ: నాన్నా! నాన్నా! అమ్మా! మన నాన్నగారే! యిక్క-డున్నారు.

ప్రచం: (శ్యామలను కౌగిలించుకొని) అమ్మా శ్యామలా! బతికే వున్నావా అమ్మా!

నీల : ఏమిటి? సరోజని యీనభార్యా! (దగ్గుతూ) గ్రహబలం బాలనట్లుంది.

[సరోజని ప్రవేశిస్తుంది]

ప్రచం: సరోజనీ నీవేనా! ఆ వరదలలోనుంచి యెలా బయట పడగలిగావు. ఇన్నాళ్ళు యెక్క-డ అవస్థలు పడుతున్నావు. నీకోసం ఊళ్ళు, నాళ్ళు అన్నీ గాలించి, చివరకు నిరాశతో గుండె బాయి చేసుకున్నాను.

శ్యామ: యీ హిమకరబాబు నన్ను రక్షించాడునాన్నా! అమ్మను కూడా కాపాడాడు.

ప్రచం: అలాగాబాబూ! మీరుచేసిన వుపకారానికేమి ప్రత్యుప కారం చేయగలను? ఒక్క-నమస్కా-రంతప్ప.

హిమ: తప్పు. తప్పు. మీరు పెద్దవారు. మేము చేసిందేమీలేదు. ఈమాత్రం తోటిమానవునకు సాయపడడం మానవధర్మం.

ప్రచం: సరోజనీ! మనందరం యీ విధంగా తిరిగి కలుసుకో గలమని నా కాశేలేదుసుమా!

సరో : అంతా దైవలీల. యీ నీలకంఠ ప్రసాదుగారి దయవల్లనే నేను కులాసాగావున్నాను. వీరునన్ను కన్నకూతురుకన్నా యెక్కు-వగా చూచారు.

ప్రచం: ఏమిటి ? నీలకంఠ ప్రసాదుగారు నిన్ను కాపాడారా ! తమాషాగావుందే ఒకదిమాట కొకరిమాటకు సంబంధమే లేదు.

సరో : లేకపోవడమేముంది ? ఆ వరదలలోనుంచి నన్ను కాపాడిందివీరే. వీరిసంరక్షణలో వుంటూండగా నాకే ఎందుకో విరక్తిగలిగి ప్రాణత్యాగం చేసుకోవాలనిపించి, గోదావరి ఒడ్డుకు వెళ్ళితే, అక్కడ హిమకరబాబు నన్ను ఆత్మహత్య చేసుకోకుండా రక్షించి వెనక్కు తీసుకొచ్చాడు.

నీల : (తనలో) యీ సరోజని యెంత గుణవంతురాలు. ఇటువంటి యిల్లాల్ని నేనెంతగా యేడ్పించాను. (ప్రకాశంగా) నన్ను వేళాకోళం చెయ్యకు సరోజినీ ! (దగ్గుతాడు)

సరో : వేళాకోళమేముంది ? (ప్రచండశాస్త్రితో) నేను వీరింటికొచ్చినతర్వాత నాదగ్గరెందుకని నాసొమ్మును నేనే వారికిచ్చాను. తర్వాత వారికి తెలియకుండా నేను వెళ్ళడంలో అది వారిదగ్గరే నిలిచిపోయింది. అంతేకాని, వారపహరించిందేమీలేదు.

హిమ: (తనలో) మహిళాలోకానికి ఆదర్శప్రాయమైన యిల్లాలివమ్మా !

నీల : సరోజనీ, నీ ఒక్కొక్కమాట ఒక్కొక్క గొడ్డలిపెట్టుగా పశ్చాత్తాపంతో ద్రవించిన నా హృదయంమీద ఘాతలు వేస్తున్నాయి. నీవు నీధోరణి మార్చుకొని జరిగిన

యదార్థం చెప్పినా, హృదయంలో నేను దాచుకొన్న స్వార్థాన్నిలాగి, బయటపడేసి ప్రపంచానికి చూపించు.

ప్రచం: ఆ విషయాలన్నీ యిప్పుడెందుకు ? మీరా ప్రక్కగదిలో వుండండి, నేనీకేసు విచారణ ముగించి వస్తాను.

సరో : నాదో చిన్నమనవి.

ప్రచం: యేమది ?

సరో : యీ నీలకంఠ ప్రసాద్‌గారు నన్ను కాపాడి ఆశ్రయ మిచ్చారు. వారివల్ల, వారి కుమారునివల్లనే మనం తిరిగి కలుసుకోగలిగాం. మనమందరం సుఖంగా కలుసుకొన్న తరువాత, మనసుఖానికి కారణభూతమైె వారిక్షేమంకూడా మనంకోరాలి.

ప్రచం: (త్రీవ్రంగా) నా ఉద్యోగవ్యవహారాల్లో, నీవేమీ ప్రవే సించవద్దు.

నీల : సరోజనీ, నీవు నా తరపున, నన్ను క్షమించమని వేడ వద్దు. యీ అంతర్యుద్ధాన్ని యీ ముసలిప్రాణమింక భరించలేదు. జరిగిన యదార్థం నీవు చెప్పకపోతే, నేను చెప్తాను. ప్రచండశాస్త్రిగారూ ! నామీద ఆరోపించబడ్డ నేరాలన్నిటినీ నే నొప్పుకుంటున్నాను. యీ సరోజని నగలుకూడా అపహరించినమాట వాస్తవం. యీ సరో

జనిమీద నే నారోపించినవన్నీ అబద్ధాలు. ఈమె ఆంధ్రు లకు ఆదర్శప్రాయమైన యువతి, నా కుమారుడు స్వార్థ రహితమైన ప్రజాసేవకుడు. హిమకరా ఇలారా! నన్ను పట్టుకో. నేనో దేశద్రోహిని.

ప్రచం: (ఆశ్చర్యంగా) ఇదేమిటి? క్షణంక్రిందట అన్ని ఆరో పణలను ప్రతిఘటించారు. ఇంతలో యీ మార్పేమిటి?

నీల : ఇంతవరకు నా ప్రవర్తన మానవప్రకృతికి విరుద్ధమైన ప్రవర్తన. కొన్ని సంవత్సరాలుగా పాశ్చాత్య విద్యా భ్యాసంలో మనం నేర్చుకున్నది యిది. ఆశిక్షణలో బాగా తర్ఫీదు పొందినవారు సంఘంలో పలుకుబడి సంపాదించి సంఘాన్ని మోసంతో దోచుకుంటూ, అధికారం చలా యిస్తూ వుంటారు. యీ విధానంతో దేశంమొత్తాన్ని మోసంచేయగలిగిన నాబోటివారు, అగ్రనాయకులు, ప్రజా సేవకులు అవుతారు. కాని, మా అంతరాత్మకు మాత్రం తెలుస్తూనేవుంటుంది. మేము అల్పజ్ఞులైన తోటి మానవుల కెంతద్రోహం చేస్తున్నదీని. ఇలా జీవితంసాగించే తరు ణంలో యీ సరోజినీదేవివంటి వారెవరో ఒకరు తమ మంచినడవడిచేత మాలో పాతుకొని వేర్లుపారిన దుర్మార్గ వృక్షానికి వేరుపురుగులై దానిని మొదలంట తొలవ నారంభిస్తారు. అపుడు మాలో క్షీణించిపోయిన "సత్" అనేపదార్థం బలంచేకూర్చుకుని ఆ దుర్మార్గ వృక్షంమీద యుద్ధంసాగిస్తుంది. ఆ అంతర్యుద్ధాన్ని సహించేశక్తి

యీ ఎముకలగూటికుంటే, ఆ జీవి పశ్చాత్తాపపడి, కడమ జీవితం మంచిమార్గంలో గడుపుతాడు. భరించలేని నాబోటివృద్ధుడు ఆ అంతర్యుద్ధంవల్ల ప్రభవించే పశ్చాత్తాపాగ్నిలో భస్మమైపోతాడు. నేనూ, నాజీవితకాలంలో చేయగలిగినన్ని అన్యాయాలు, అక్రమాలు చేశాను. ప్రతి చెడుపని చేసేటప్పుడు అన్యాయంచేస్తున్నానని నా అంతరాత్మకు నాకు తెలుసు. కాని యీనాటి సంఘంలో పలుకుపడిగలవాడు, ధనికుడు కావాలంటే అంతకంటే మార్గం లేదు. దీనికికారణం యీ నాటికికూడా మనమింకా పాశ్చాత్య వ్యామూహబద్ధులం కావడమే. మనల్నివాళ్ళు విడిచివెళ్ళినా వాళ్ళనాగరికతమీద వాళ్ళ సాంప్రదాయాల వ్యామూహంమాత్రం మనకు చావలేదు. భగవదనుగ్రహం వల్ల యే మహానుభావుడైనా వుద్భవుంచి, యీ వ్యామూహాన్ని నశింపచేసి జాతీయ సంస్కృతిని, జాతీయ నాగరికతను, జాతీయ సాంప్రదాయాలను స్థాపించగలిగితే ఆనాడు భారతజాతికి మోక్షంకలిగి సుస్థిరశాంతి నెలకొల్పబడుతుంది. అలాకాకుండా యెన్నిజెండా లెగురవేసినా, యెన్ని పోరాటాలు జరిపించినా, యెన్ని ఉపన్యాసాలిచ్చినా, ప్రభుత్వంలో చేతులుమారడంతప్ప మనజాతి కష్టాలు తీరేమాట వుత్తది. కాకపోతే ఆనాడు తెల్లవాళ్ళమీద పోరాడాము. యీనాడు మనలోమనం పోట్లాడుకుంటున్నాం. అంతేభేదం. ఈనాడు మనకు కావలసింది "స్వజాతీయ సాంప్రదాయాల పునరుద్ధరణ" గాని,

విజాతీయ సాంప్రదాయానుకరణ గాదు. భారతీయు లందరూ ఇది గుర్తించాలని ఆశిస్తున్నాను. (దగ్గుతూ) నేరాలన్నీ ఒప్పుకున్నట్లు వ్రాయండి. సంతకం పెడతాను. హిమకరా! కళ్ళు తిరిగిపోతున్నాయి. నన్ను కూర్చో పెట్టు.

[హిమకరుడు సరోజని పట్టుకొంటూరు.]

ప్రచం: ముందు అవతలగదిలో పడుకోపెట్టండి. డాక్టర్ను పిలవండి.

నీల : డా........క్ట........రు........వ........ద్దు.

[అందరూ నీలకంఠ ప్రసాద్‌ను తీసుకు వెళ్తూంటే]

తెర వాలుతుంది

# పదునొకండవ రంగం

[ప్రచండశాస్త్రి, హిమకరుడు, సరోజినీ, శ్యామలా, తమ్మన్న ప్రవేశింతురు.]

ప్రచం: ఆయనంత అకస్మాత్తుగాపోవడం చాలా ఆశ్చర్యంగావుంది.

హిమ: నాన్నగారు తఱచు చెప్తూనేవుండేవారు. తానేదో భరించ లేని ఆవేదన ననుభవిస్తున్నానని. యెప్పుడో ఒకప్పుడు అకస్మాత్తుగ గుండె ఆగిపోతుందని.

ప్రచం: విచారించకునాయనా! మనచేతుల్లో యేముంది? మనం నివసించే ప్రపంచమంతా ఒక గాజుకొంప వంటిది. యీ గాజుకొంపలలో నివసించేమనం యెప్పుడు యెక్కడ రాలిపోగలమో యెవరు చెప్పగలరు? ఇది గ్రహించలేక అనేక అకృత్యాలుచేసి జీవితాన్ని వ్యర్థంచేసుకుంటాం. ఈ గాజుకొంపలో చివరకు మిగిలేది మంచిచెడ్డలు మాత్రమే. జాగ్రత్తగా సద్బుద్ధితో ప్రవర్తించు నాయనా. నీకు భగవదనుగ్రహం కలుగుతుంది.

హిమ: మీబోటి పెద్దల అనుగ్రహంకూడా వుండాలి.

ప్రచం: సరోజనీ, మననాటకం విషాదంగా ప్రారంభమయినా సుఖంగానే అంతమయింది. ఇంక మనదారి మనం చూచు కుందామా!

సరో: ఎక్కడైనా ఒక పూరిపాకాఅయినా వేసుకోంది యెక్కడి కెళ్ళగలం?

ప్రచం: అందుచేత హిమకరబాబుగారింట్లోనే మకాం వేద్దా మంటావా! బాగుంది.

తమ్మ: బాబయ్యా! తమరు పెద్దోళ్ళు, సదువుకున్నాళ్ళు తమరేమీ అనుకోకుండావుంటే, నే నోమాట సెప్తాను.

సరో: చెప్పుతమ్మన్నా! నీకు భయమెందుకు? తండ్రిలా కాపాడావు.

తమ్మ: అమ్మాయిగారు సిన్నోరు, చాలా మంచోరు. వున్న తండ్రి కాస్తా పొయ్యాడు. పెద్ద దిక్కెవ్వరూ లేరు. ఈ లంకంత యింట్లో ఒక్కడే కాలం గడపాలంటే చాలాకష్టం. అందుసేత అమ్మాయిగారొక యింటివారయ్యేవరకూ, తమ రిక్కడే వుండడం సాలా బాగుంది.

సరో: అవునండీ! మనం ఇల్లు కట్టుకొనేవరకు పోనీ, అద్దె యిచ్చి యిక్కడే వుండకూడదూ? మనకు మాత్రం ఎవరున్నారు? మనఅమ్మాయికికూడా అతనంటే యెంతో అభిమానం. ఒకరికొకరు తోడుగా వుంటారు.

[హిమకరుడు, శ్యామలా ఒకరినొకరు ఓరగా చూచుకొంటూరు. అది ప్రచండశాస్త్రి గమనిస్తాడు.]

ప్రచం: ఓహో! ఇప్పటి Circustancial evidance ను పట్టి చూస్తే, స్నేహం ముదిరి ప్రేమగా మారుతున్నట్లు తోస్తూన్నది. కనుక యీ కేసులో నేనిప్పుడే తీర్పు చెప్పేస్తున్నాను. హిమకరబాబూ! నా Judge ment మీద appeal వుండకూడదు సుమా! యేమి సరోజనీ దేవిగారూ! తీర్పు చెప్పమన్నారా!

సరో : చాల్లేండి. మీ జడ్జీతనం ఇంట్లోకూడానా !

ప్రచం: అపుడే మనిల్లైంది ! నీ వైఖరిచూస్తే పోయిఇల్లు పోనే పోయింది. నీలకంఠ ప్రసాదుగారి భవనమైనా దక్కించు కొందా మనుకున్నట్లున్నావే.

సరో : ఏమిటండీ మీ వేళాకోళం. ఎవరైనావింటే నవ్విపోతారు.

శ్యామ: మరి వెళ్దాం పదనాన్నా !

ప్రచం: ఇంకెక్కడికి ?

శ్యామ: ఎక్కడికో వెళ్దామని మీరేగా అన్నారు.

ప్రచం: అనుకున్నాను. కానీ, నీవు యీ కేసును sudden గా మార్చేశావు.

శ్యామ: చాల్లే నాన్నా !

[శ్యామల విదిలించుకొని అవతలకు పోబోతే ప్రచండశాస్త్రి శ్యామల చెయ్యిపట్టుకొని హిమకరబాబును దగ్గరకు తీసికొని]

ప్రచం: **I do heve by a ward the decree that you must marry each other and become man and wife.**

[హిమకర శ్యామలలు ప్రచండశాస్త్రిగారి పాదాలదగ్గర మోకరించి కూర్చుంటారు.]

హిమ: ఆశీర్వదించండి.

మంగళమ్ - మంగళమ్ - మంగళమ్.

స మా ప్త ము.

